## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014293,94

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్.

# పురాణచంద్రిక.

## మొదటి భాగము.

[illegible],

మహావాది వేంకటరత్న విరచితము.



**Sold By**

RAMA & CO., BRANCH: TENALI.

1930

[illegible]



**Price As. 4.**

# విషయసూచిక




| | | |
|---|---|---|
| ౧. | ఇంద్రసేన మహారాజు. | పుట ౧ |
| | (స్కాంధపురాణాంతర్గతము) | |
| ౨. | కిరాతుఁడు శివభక్తుఁడై తరించుట. | ౫ |
| ౩. | కాలకల్బుని చరిత్ర. | ౧౧ |
| | (పద్మపురాణాంతర్గతము) | |
| ౪. | సత్యకేతుని చరిత్ర. | ౧౭ |
| ౫. | ధ్రువుని చరిత్రము. | ౨౨ |
| | (విష్ణుపురాణాంతర్గతము) | |
| ౬. | పృథుచక్రవర్తి చరిత్ర. | ౩౦ |
| ౭. | సౌభరి చరిత్రము. | ౩౭ |
| ౮. | కల్మాషపాదుని చరిత్ర. | ౪౩ |
| ౯. | జడభరతుని చరిత్ర. | ౫౦ |
| | (భాగవతపురాణాంతర్గతము) | |
| ౧౦. | నృగమహారాజు చరిత్రము. | ౫౭ |

లన్నియు నీతని యందు స్థిరముగా నిలచియుండెను. ఇట్టి దుష్కా ర్యములే యాతనికి ముఖ్యములైన పనులై యుండెను. రాజైన వాఁడే యీవిధముగా నుండ, రాజసేవకులను గూర్చి యింక వేఱుగాఁ జెప్పనేల? వారును ఇంద్రసేనునకుఁ జేదోడుగా నిలచి యాతని దుష్కార్యాచరణమునకు మఱింత ప్రోత్సాహ మొసంగుచుండిరి. ఇట్టి ప్రభుత్వము వలన రాష్ట్రములోని ప్రజలందఱును, సుఖమన నేమిటో యెఱుంగని వారై, యెల్లప్పుడు కష్టములకు లోనుఁగాఁ జొచ్చిరి. ఇది తగదని నచ్చిన వారలలోఁ గొందఱు ఇంద్రసేనునకు హిత ముపదే శించిరి. కాని యాతని దుష్ప్రవర్తన మెంతమాత్రమును మాఱినదికాదు.

ఇంద్రసేనుఁ డింతటి దుర్వర్తనుఁడై యుండిన నప్పటికిని, ఆతనియం దొక మహత్తరమైన గుణము ప్రకాశించు చున్నది. అదియేమి? అతఁ డేకార్యమునుఁ జేసినప్పటికి — తుదకు ఘోరకృత్యమునే చేయునప్పుడైనను — ఏతత్కా ర్యాచరణమునకు ముందే శివనామోచ్చారణ మొనర్చు చుండెడివాఁడు. ఇదియైనను అతఁడు బుద్ధి పూర్వకముగా నొనర్చునదికాదు. ఏది యెట్లున్నను, శివుని దలంచుట యను నది యాతనికి సహజమై యుండెను. ఇందువలన నాతని పాపము లన్నియు నశించిపోవునేమో?

ఇట్లతఁడు పెక్కు సంవత్సరములు రాజ్యమును బాలించి తుదకు మృతినొందెను. అప్పుడు యమకింకరు లాతనిఁ జుట్టు ముట్టి, యనేక విధముల బాధించుచుఁ బాపులను శిక్షించు వాఁడును, దమకుఁ బ్రభువును అగు యమధర్మరాజు కడకుఁ గొనిపోయిరి. యముండును ఇంద్రసేనునిఁ గాంచి 'రాజా! నీ జీవితకాలమున నీవార్జించిన పుణ్యఫలమున కిప్పుడే యనుగఁ గలవు. సిద్ధముగా నుండు'మని తెలియఁ జేసెను. అప్పుడు ఇంద్రసేనుఁ డామహాత్మునిగాంచి, చేతులు జోడించినవాఁడై 'స్వామీ! నాజీవితకాలమున నేనార్చిన పుణ్యకార్య మొక్కటియుఁ లేదు. నేను జేయనిదుష్కార్య మొక్కటియునులేదు. నాజీవితమంతయు దుర్వర్తనమున ముగింపఁ బడినది. అట్టియెడ నేనెట్లు పుణ్యము నార్జించితిని? మీరు నుడివినట్లు నాకిప్పుడుఁ బుణ్యఫల నివాస మెట్లబ్బును? నేనన్ని విధముల శిక్షింపఁ బడవలసిన వాఁడనే కాని సన్మానింపఁ బడవలసిన వాఁడను గాను.' అని చెప్పెను. యముం డాతని పల్కుల నాలకించి 'ఓయీ! ఇంద్రసేనా! నీవు చెప్పిన దంతయు నిజము. నీజీవిత కాలమున నీవెఱిఁగి చేసినది పుణ్యకార్య మొక్కటియును లేదు. అయినను నీవేపనినిఁ జేసినప్పటికిని, ఆపనికి ముందుగా శివుని దలంచెడివాఁడవు. ఇది నీ వెఱిఁగి చేసినదియుఁగాదు. ఇట్లొనర్చుచుంటినని నీవును దెలిసికొనిన వాఁడవుగావు. అది

నీకు స్వతస్సిద్ధమగు గుణమై పోయినది. ఇట్లు ప్రతి పనికి ముందుగా శివుని దలంచుచుండుట వలన, అది దుష్కార్య మైనప్పటికిని దాని యొక్క ఫలము నిన్ను జేరుటలేదు. ఎవని నీవు తలంచి యా కార్యమును జేయు చుంటివో, యట్టి వానికే దాని ఫలముగూడఁ జెందుచున్నది. అందువలననే నీకుఁ బాపఫల మనుభవింప వలసిన యవసరము లేదు. ఈ శివనా మోచ్చారణంబువలన, నీవెన్ని దుష్కార్యము లొనర్చి నప్పటికిని, వాని ఫలము నీకు లేకపోవుటయేగాక, మీదు మిక్కిలి నీవు జన్మ రహితుండ వైతివి. ఇదియే సర్వేశ్వరుని మాయ. జగదీశుఁడగు సదాశివుఁడే యన్నిటికిని మూలమైన వాఁడు. ఆతని నామస్మరణము సమస్త పాపములను బోఁగొట్టును. ఆ మహాత్ముని హృదయమున నిల్పి భక్తి పూర్వకంబుగాఁ బంచాక్షరీ మంత్రమును జపించునట్టి వారు కేవల మాతనితో సమానులగుచున్నారు. నీవును శివనామ చింతనంబు వలనఁ దరించితివి.' అని చెప్పు నంతలో శివదూత లచ్చోటికివచ్చి, యింద్రసేనుని విమానముపై నెక్కించుకొని కైలాసమునకుఁ గొంపోయిరి. అచ్చోట సదాశివుఁ డాతని గారవించి, యాతనికి శివభండుడని పేరు పెట్టి తన సముఖమునందే యుంచు కొనెను.

**నీతి:**—బాలకులారా! శివుని నామో చ్చారణంబు

వలనఁ బాపము లన్నియును నశింపఁ గలవు. బుద్ధి పూర్వక ముగాఁ గాక, యప్రయత్న పూర్వకముగనైన ఆమహాత్మ్యనిఁ గలిగించినచో నెంతటి పాపాత్ములైనను దరింతు రనుటకు మన కీకథయే యుదాహరణ మగుచున్నది.

---

## ౨. కిరాతుఁడు శివభక్తుఁడై తరించుట.

(స్కాంద పురాణాంతర్గతము)

పూర్వము అవంతి యను ఒక పట్టణముగలదు. ఆపట్టణమున నందియను పేరుగల ఒక కోమటియుండెను. అతఁడు మిక్కిలి ధనము గలవాఁడు. ధనవంతుఁడైనప్పటికిని మంచి శివభక్తిపరుఁడు. ఆపట్టణమునకుఁ దూర్పుదిక్కున ఒక చిన్న అడవి యుండెను. ఆయడవియందొక శివలింగము వెలసెను. ఈకోమటి శివభక్తిపరుఁడును, అందు ధనము గలవాఁడును అగుటవలన, ఆశివలింగమున్నచోట దేవాలయము నొక దానిని నిర్మించి నిత్యము పంచామృతములతోను, బుష్పములతోను, సువర్ణాభిషేకములతోను, మంత్రపూర్వకముగా, ఆసదాశివుని భజింపసాగెను.

ఇట్లు పెక్కుదినములు గడచిపోయెను. ఆలింగమునకు నిత్యము కోమటివలనఁ బూజ జరుగుచుండెను. ఇట్లుండగా

ఒకనాఁడు ఆపట్టణమునకుఁ జేరువనున్న యొకపల్లెయందుఁగల కిరాతుఁడొకండు కులవృత్తి ప్రకారము పక్షివేటకై బయలు దేరి, విధివశమున నీయడవిని బ్రవేశించెను. అట్లు ప్రవేశించి కొంత తడవునకు వేట సాలించినవాఁడై యాతఁడు గృహమునకుఁ దిరిగివెళ్లుచు మార్గమధ్యమున నీశివాలయమునుగాంచి యందుఁబ్రవేశించెను. ఆ యాలయంబునఁగల శివలింగమును గాంచినంతనే యాకిరాతునకొక విధమగు మూఢభక్తి జనించెను. తన్మూలమున లింగమును బూజింపవలయునని యాతనికి బుద్ధిపుట్టెను. కాని నిర్జనంబగు నాయడవి యందు నాతనికిఁ బూజోపకరణము లేవి జిక్కును? అంత మాత్రముచేత నాతఁడు హతాశుఁడుగాలేదు. అన్నిఁటికి భగవంతుఁడే కలఁడను నమ్మకముతోఁ జెంతనున్న సరోవరంబునకరిగి, పుక్కిట నీటినిఁబట్టికొని, యచ్చోటనేయున్న మారేడు పత్రిని గొంతకైకొని యాలయమును బ్రవేశించెను అదివఱకే కోమటివలన లింగమునకుఁ బూజ జరిగియుండెను. అందువలన లింగముపై రత్నములు, పుష్పములు ఉండెను. అట్టి వానినన్నింటిని ఆకిరాతుఁడు తీసిపారవైచి, తన పుక్కిటనున్న నీటినే, యభిషేకమునకు వినియోగించి, తానుగైకొని వచ్చిన పత్రితోడనే పూజించి, తాను సంపాదించిన పచ్చి మాంసమునే నివేదనముగా నర్పించి, నిశ్చలమగుమనస్సుతో

సుస్థిరమగు భక్తితో, సర్వేశ్వరుఁడే యన్నిఁటికిఁ గారణుఁ డను దృఢవిశ్వాసముతో నాలింగమునకుఁ బ్రదక్షిణ పూర్వ కముగా నమస్కారమొనర్చి, కొంత తడవు ధ్యానించి నిజ నివాసమున కరిగెను.

మఱునాఁడెప్పటియట్లు కోమటి లింగమునకుఁ బూజ లొనర్చుటకై యచ్చటి కరుదెంచెను. పూజ సేయించుటకై యాతనివెంట నొక బ్రాహ్మణుఁడును గూడ వచ్చియుండెను. వారిద్దఱును గుడిని బ్రవేశించి చూచునప్పటికి, అంతయు నపరిశుద్ధముగా నుండెను. ఇదియేమని వారాశ్చర్య పడసాగిరి. ఎట్టెటులో స్థలమును శుద్ధిపఱచి, యాకోమటి తన పూజా విధానమును ముగించుకొని గృహమున కరిగెను. అతఁడరిగిన కొంత సేపటికి కిరాతుఁడరుదెంచి యెప్పటియట్ల పూజించి గృహమున కరిగెను. ఆమరుచటి దినమున నాకోమటి తిరిగి పూజకై వచ్చి చూచునప్పటికిఁ గ్రిందటి రోజువలనే గుడి యంతయు నపరిశుద్ధముగా నుండెను. అప్పుడతఁడు తనతో నున్న బ్రాహ్మణునితోఁ జక్కగా విచారించి, ప్రతిదినమిూ విధముగా నర్చించుట యసంభవమని తలంచినవాఁడై యా లింగము నెత్తికొని తన గృహమున కరిగి, ఇంటియందే యాలింగమునకుఁ బూజ లొనర్పనాగెను. లింగమును గొని పోయినంత మాత్రమున సర్వవ్యాపియగు సదాశివుఁడు

ఆగుడియందు లేకుండఁబోవునా? అంత మాత్రమున నిశ్చల భక్తితత్పరుఁడగు కిరాతుని పూజా విధానమునకు భంగము గలుగునా?

ఎప్పటియట్లు మధ్యాహ్నమగు సరికి కిరాతుఁడు శివారాధనమునకై గుడికి వెళ్ళెను. కాని యాతఁడు గుడిని ప్రవేశించి చూచు నప్పటికి అందు లింగము లేకుండెను. ఆక్షణమునందే యాతనికి విచారము మెండయ్యెను. విచారముతోఁ బాటు విషాద మినుమడించెను. తుద కేమియుఁ దోచక యేడువ నారంభించెను. ఆ యేడుపు కొంత తడవునకు నిర్మలమగు భక్తిగాఁ బరిణమించెను. అప్పు డతఁడు చేతులు జోడించి 'స్వామీ! నేను కేవలము బాలుఁడను. నిన్నెట్లు పూజింపవలయునో నాకుఁ దెలియదు. రత్నములతోఁ బూజించుటకు నేను సమర్థుఁడను గాను. పువ్వులతోఁ బూజించుటకు నేను జాలిన వాఁడను గాను. నా హృదయ కుసుమమునే నీ కర్పించి పూజించుచుంటిని. నా పూజావిధానమునందుఁ దప్పున్నచో నన్ను మందలింపుము. నీ విట్లు కాన్పింపకుండుట తగదు. సదాశివా! నీవే కాన్పింపకున్న నాకీ లోకముతోఁ బనిలేదు. బాలునియెడ, అందు భక్తునియెడఁ గోప మూనుట భక్తావనుండవగు నీయట్టి వానికిఁ దగినది కాదు. స్వామీ! ఎప్పటియట్ల ఇచ్చోట నాకు గాన్పించి నాపూజఁ గైకొనుము.

నన్ను మన్నింపుము. నేను నీపూజార్థమై యిచ్చటికి వచ్చి యుండ నీవు నాకుఁ గాన్పింపకుండుట భావ్యమా? నీవు నాకు దర్శన మియ్యకున్నచో ఇచ్చోటనే, నీయెదుటనే, నిన్ను దలంచుచు నా ప్రాణముల విడతును. ఇదియే నానిశ్చితము.' అని యనేక విధములఁ బ్రార్థించెను. కాని పరమేశ్వరుఁ డాతనికి సాక్షాత్కరింపలేదు. మఱికొంత తడవు ప్రార్థించెను. అప్పటికిని భగవంతుఁ డాతనికిఁ గాన్పింపలేదు. అప్పుడు దృఢభక్తి పరుఁడగు నా కిరాతుఁడు 'ఛీ! ఇంక నాజన్మమేల కాల్పనా?' యని విరక్తి నొందినవాఁడై 'హరహరా' యని శివనామోచ్చారణ మొనర్చుచు నొక్క వ్రేటునఁ దన శిరస్సును నరుకుకొనెను. వెంటనే యాతనికి వేఱొక శిరస్సు మొలచుటయుఁబరమేశ్వరుఁడు ప్రత్యక్షమగుటయుఁబ్రాప్తమాలయ్యెను. అప్పుడు దివినుండి దేవదుంధుభులు మ్రోగెను. పూలవానలు గురిసెను. బ్రహ్మాది సకలదేవతలు మహేశ్వరునిఁ గీర్తింపఁ దొడంగిరి. నారదుఁడు వీణయ మీఁద శివ గీతమును బాడుచు నృత్యముసేయఁ జొచ్చెను. ఈవిధముగాఁ బ్రకృతి యంతయు నేత్రానందకరముగా నుండెను.

అట్టియెడఁ గోమటి శివ ప్రీతుఁడై భక్త శిఖామణి యగు కిరాతుని దర్శించుటకో యనునట్లు గుడిని బ్రవేశించెను. అతఁడు గుడిలోని కరిగినంతనే పరమేశ్వరుఁడును,

ఆతని సన్నిధానమునఁ జేతులు గట్టుకొని నిలిచియున్న కిరాతుఁడును, ఆతనికిఁ గానుపించిరి. మఱు క్షణమునందే యా కోమటి తన యవివేకపుఁ బనికి లజ్జపడినవాఁడై, సదా శివుని బెక్కు తెఱంగుల ధ్యానించి, భక్తాగ్రేసరుండగు కిరాతునిఁ గౌఁగలించుకొని «అన్నా! నీమూలమున నా జన్మము తరించినది. ఇదివఱకు నిన్ను గేవలము మూర్ఖునిఁగాఁ దలంచి నందులకు క్షమింపుము. భక్తుఁడవన నీవే భక్తుఁడ'వని యాతనిని గీర్తించెను. అప్పుడు పార్వతీ కాంతుఁ డతనిఁ జూచి «ఓయీ! నీవుగూడ నాకు నచ్చినవాఁడవు. మీ రిద్దఱును సూర్య చంద్రు లున్నంతవఱకు నా యొద్దనే యుండెదరు. అని పలికినవాఁడై యప్పుడే వారలతోఁ గలసి కైలాసమున కరిగెను.

నీ౹:—బాలకులారా! భగవంతునిఁ బూజించుటకు జాతి మత భేదములులేవు. పూజోపకరణాదు లెంతమాత్రమును బ్రిధానములుగావు. నిర్మలమగు భక్తియు, నిశ్చలమగు హృదయము—ఇవియే కావలసినవి. ఇవియున్న యెడలఁ బరమేశ్వరుని సాన్నిధ్యమును బొందఁ గలము.

---

# 3. కాలకల్పుని చరిత్ర.

(పద్మ పురాణాంతర్గతము.)

పూర్వము త్రేతాయుగమునందు మధురా పట్టణములో సోమశేఖరుఁడను ఒక బ్రాహ్మణుఁ డుండెను. ఇతఁడు సమస్త శాస్త్రములను జదివినవాఁడును, జతుర్వేదములను నేర్చినవాఁడును, వేదాంత విద్యావివేకమును సంపాదించినవాఁడును, సత్యశీలుఁడును, దయామయుఁడును, అక్రోధనుఁడును నై యుండెను. ఇతని భార్యపేరు విశాలాక్షి. ఈమెయు సత్ప్రవర్తనము గలది. శీలవతి. గుణవతి. పతివ్రత. అన్నిఁటికంటెను సత్కులమునందుఁ బుట్టినది. ఎల్లప్పుడును భర్తనే దైవమువలెఁ బూజించుచుండెడిది. వీరి దాంపత్యముచూచువారికిఁ గన్నుల పండువుగా నుండెను. ఇట్టి సత్ప్రవర్తనము నకుఁదోడు వీరికి విష్ణుభక్తి పెట్టనిభూషణమై యొప్పుచుండెను. ఇంటికి వచ్చిన అతిథి అభ్యాగతులను జక్కగా సత్కరించుచుండెడివారు. వీరి సంసారము సౌఖ్యభరితమై యుండెను. వీరి గృహము భూలోకస్వర్గమైయలరారుచుండెను. తమ జీవితము నీ విధముగా గడపుచు, ఈ బ్రాహ్మణదంపతులు మోక్షమును బొందఁగోరి గంగాయాత్ర కరిగి యచ్చోటఁ గాశీ విశ్వేశ్వరుని సందర్శించి, కొన్ని నాళ్ళందు నివసించి,

పవిత్రములైన గంగోదకములను గైకొని తిరిగి తమ నివాసమున కరుదెంచుచుండిరి.

ఆదంపతు లట్లు వచ్చుచుండ మార్గమధ్యమున వారి కొక పురుషుఁడు గాన్పించెను. అతఁ డొక పశ్చిమ దేశస్థుఁడు. కులమువలన వైశ్యుఁడు. ఆతనిపేరు రత్నాకరుఁడు. వ్యాపారము నిమిత్తమై, సరకులను బండ్ల కెత్తించుకొని, యాతఁ డరుగుచుండ, అప్పు డొక యెద్దు బండి బరువువలన నడువలేక నిలచి పోయెను. అంత నా కోమటి తన నౌకర్లలో నొకఁ డైన కాలకల్పునిఁ జూచి 'ఎద్దును అదలింపు' మని హెచ్చరించెను. వాఁడును దన చేతనున్న కఱ్ఱతో దానిని బలముగాఁ గొట్టెను. అప్పు డాయెద్దు గింజుకొని త్రాళ్ళు తెంపుకొని తన్ను గొట్టిన యా కాలకల్పుని పొడిచెను. సూది మొనవలె నున్న దాని కొమ్ము అతని చిరు డొక్కయందుఁ గ్రుచ్చుకొనుట వలన నాతఁడు వెంటనే పుడమిపైఁ బడి మరణ వేదనకు లోనయ్యెను. అట్టి యవస్థయందున్న కాల కల్పునే యీ బ్రాహ్మణ దంపతులు చూచినది. సోమశేఖరుఁడు దయార్ద్ర హృదయుఁడగుటవలనఁ జూచిన వెంటనే యాతనిని సమీపించి తన కలశము నందున్న గంగోదకమును గొంత వాని నోటిలోఁబోసి, తానదివఱకు విష్ణు పూజానంతరము చెవియం దిడుకొనియున్న తులసీ దళమును అతనిపై వైచెను.

మఱి కొంత సేపటికి కాలకల్పుఁడు మరణించెను. ఆతని మరణమునకు మిక్కిలి విచారపడుచు సోమశేఖరుఁడు భార్యతోఁ గలసి ముందున కరుగుచుండెను.

వారట్లు కొంతదూర మరుగు నప్పటికి మఱొక భయంకర దృశ్యము వారికి దృగ్గోచర మయ్యెను. ఎట్టయెదుట భీకరాకారులగు కొందఱు భటులు వారికిఁ గానుపించిరి. వారిలోఁ గొందఱు కాళ్లు విరిగి, కొందఱు చేతులు తెగి, కొందఱు ముక్కులు చీల్పఁబడి, యనేకవిధముల వికలాంగులై యుండిరి. వారినిఁ గాంచి నంతనే సోమశేఖరుఁడు జాలి పడినవాఁడై, వారి చెంతకరిగి "అయ్యా! మీ కీ యవస్థ ఎందుకుఁ గలిగినది? దీనికిఁ గారణ భూతులెవ్వరు? ముందు మీ రెవరి వారలు? మీ చరిత్రమెట్టిది? సవిస్తరముగాఁ దెలియఁజేయుఁడని యడిగెను. అప్పుడు వారిలోఁ గొందఱా బ్రాహ్మణునిఁ గాంచి "అయ్యా! మేము యముని దూతలము. పెక్కు పాపము లొనర్చి, నోరులేని యొక యెద్దును బట్టికొట్టి, తుదకు దానిచేత మృతినొందిన కాలకల్పునిఁ దగిన విధమున శిక్షించుటకై మా ప్రభువు నాజ్ఞానుసార మాతనిఁ గొని పోవుచుంటిమి. అట్టియెడ విష్ణుదూతలు మా కడ్డము వచ్చి వీనిని విడువ వలసినదని గద్దించి పలికిరి. అందుకు మేము సమ్మతింపక వారితో "అయ్యా! వీఁడు మహాపాపి. వీనిని మేము

విడువఁ జాలము' అని పలికితిమి. అంత మాకును వారికిని ఈ విధముగా సంభాషణ జరిగెను.

విష్ణుదూతలు—ఓయమదూతలారా! వీఁడేమి పాపము లొనర్చెనో తెల్పుఁడు?

యమదూతలు—వీఁడొనర్చిన పాపము లివి యని చెప్పుటకు వలను పడదు. ఈతఁ డొనర్పని పాపకార్య మొక్కటియును లేదు.

విష్ణుదూతలు—అగుఁగాక! ఈతనిని మీరేల కొనిపోవలయును?

యమదూతలు—వీఁ డొనర్చిన పాపమునకుఁ దగిన శిక్ష విధించుటకుఁగాను మాప్రభుని యాజ్ఞానుసారము వీనిఁ గొనిపోవుచుంటిమి.

విష్ణుదూతలు—ఈతఁ డొక్క పుణ్యకార్యమైనను జేయలేదా?

యమదూతలు—లేదు. నిశ్చయముగాఁ జేయలేదు.

విష్ణుదూతలు—ఓయమదూతలారా! మీరు బాగుగ నాలోచింపుఁడు. ఇతఁడు చనిపోవునప్పు డొక బ్రాహ్మణుఁడు వీని నోటిలో గంగోదకమును బోసినాఁడు. తులసీదళమును అతని పైన నుంచినాఁడు. అతఁడు వినునట్లు శ్రీమన్నారాయణుని పేరును ఉచ్చరించినాఁడు.

ఇదియే వారు గొనర్చిన పుణ్యము. ఇంతకన్న మించిన పుణ్యమేదియును లేదు. అందువలననే మాప్రభువగు విష్ణుమూర్తి ఈతనిని విమానముపై నెక్కించుకొని రావలసినదని మాకాజ్ఞాపించియున్నాఁడు. అల్లదే విమానము. చూడుడు. కావున వీనిని మీరు విడిచి పొండు.

యమదూతలు—ఇంత మాత్రమునకే వీనిని విడుతుమా? మహాపాపియైన వీనినిఁ గొనిరావలసినదని మాప్రభువైన యముఁడాజ్ఞాపించియున్నాఁడు. ఆతని యాజ్ఞను మే మతిక్రమింపఁజాలము.

విష్ణుదూతలు—అట్లగుచో యుద్ధమునకు సంసిద్ధులు గండు. మిమ్ము నోడించియే మాప్రభువు నాజ్ఞను బరిపాలించెదము.

అని మాపైఁ గవిసిరి. అప్పుడు వారికిని మాకును ఘోరయుద్ధము ప్రారంభమయ్యెను. కాని వారందఱును మహాశూరులగుటవలన మమ్మందఱిని అచిరకాలముననే యోడించి యాతనిని విమానముపై నెక్కించుకొని వైకుంఠమున కరిగిరి. వారి వలన దెబ్బలుతిని యిట్లు వికలాంగులమై పడి యుంటిమి. ఇదియే మా దీనచరిత్రము.' అని తెలియఁజేసి యమదూతలు నిజ నివాసమున కరిగిరి. ఆహా! గంగోదక మాహాత్మ్య మెట్టిది ?

యమదూత లరిగిన యనంతరము సోమశేఖరుఁడు, వారి చరిత్రమునకును, కాలకల్పుఁడు తరించుటకును, గంగోదకమాహాత్మ్యమునకును, మిక్కిలి యాశ్చర్యపడుచు 'ఆహా! ఎప్పుడో యొకప్పుడు త్రాగినంత మాత్రముననే సమస్త పాపములు తొలఁగి పోవుచుండ, నింక కలకాల మచ్చటనే యుండి, గంగాస్నాన మొనర్చుచు, గంగోదకమును ద్రావుచు, జీవన మొనర్చినచో నింకెంతటి భాగ్య మబ్బునో కదా?' యని తనలోఁ దాను తర్కించుకొనుచుఁ దుదకు గంగాతీరముననే స్థిరముగా నివసించుటకు నిశ్చయించుకొని, భార్యతోఁ గలసి తిరిగి గంగా తీరమున కరిగెను. అచ్చోట నొక కుటీరమును నిర్మించుకొని, నిత్యము గంగాస్నాన మొనర్చుచుఁ, గాశీ విశ్వేరుని భజించుచు, అతిథి అభ్యాగతులను, ఎప్పటియట్లాదరించుచు, సన్మార్గమున జీవయాత్రను గడపి, దేహాంతమ్మున అక్షరంబగు మోక్షమును బొందెను. ఆహా! జన్మమనిన ఆబ్రాహ్మణ దంపతులదే జన్మము!

నీతి:—బాలకులారా! గంగా స్నానము, గంగోదక పానము, సకల శుభముల నొడఁగూర్చును. మఱియు మానవ జన్మను దరింపఁ జేయును. దీనికి కాలకల్పుని చరిత్రమే యుదాహరణము.

---

# ౪. సత్యకేతుని చరిత్ర.

(పద్మపురాణాంతర్గతము)

పూర్వము కురుక్షేత్రమునందు భద్రాత్ముఁడను ఒక బ్రాహ్మణుఁ డుండెను. ఆయన సమస్త శాస్త్రములను, నాలుగు వేదములను జదివిన వాఁడు. ప్రతిదినము విధ్యుక్త ముగాఁ దన కర్మలను జేయు చుండెడి వాఁడు. ఇట్లుండఁగా ఒకనాఁడాయన తన యింటి ముంగిట కాళ్లు గడిగికొని లోనఁ బ్రవేశించి జపము చేసికొన నారంభించెను. అట్టియెడ నయ్యది మండువేసంగి యగుటవలన నొక కుక్క ఎండ వేడిమికి సహింపఁ జాలక అటునిటు దిరుగుచుఁ జల్లని స్థలముకొఱకు వెదకి కొనుచు వచ్చి భద్రాత్ముని యింటి ముంగిట, ఆయన కాళ్లు గడిగికొనియున్న ప్రదేశమునందుఁ బరుండెను. ఆ ప్రదేశము నందింకను నీరు నిలచి యుండుటవలన ఆ నీటినిద్రాగి యా కుక్క కొంతవఱకుఁ దన దప్పినిగూడఁ దీర్చికొనెను. ఆవిధ ముగా నా శ్వానము పండుకొనియుండ భద్రాత్ముని సేవకుఁ డొకఁడు దానిని జూచి, యింటిముంగిటఁ బండుకొనియున్న యా కుక్కను వెడలఁ గొట్టకున్నచోఁ దన యజమానుఁడు కోపగించునని మనంబునఁ దలపోసినవాఁడై దానిపై నొక ఱాయి రువ్వెను. విధివశమున నా ఱాయి యా కుక్కకుఁ బ్రమాదస్థలమునఁ దగులుటవలన వెంటనే యది పెద్దపెట్టున

నఱచుచుఁ గొంతవడి గింజుకొని తుదకుఁ బ్రాణములఁ బాసెను. ఆకుక్కయొక్క యార్తధ్వని ఇంటిలో జపము జేసికొనుచున్న బ్రాహ్మణునకు వినవచ్చెను. భూతదయాపరుఁడగుటవలన వెంటనే యాయన బయటికి వచ్చి చూచునప్పటికచ్చోట కుక్కకు మాఱుగా ఒక దివ్యపురుషుఁడు నిలచి యుండెను. ఆపురుషుని గాంచినంతనే భద్రాత్ముఁ డాశ్చర్య చకితుఁడయ్యెను.

అట్లు కొంతకాలము గడచిన యనంతరము ఆవిప్రుఁడా దివ్య పురుషునిఁ గాంచి «మహానుభావా! మీరెవరు? ఎందు నుండి యిటకు వచ్చితిరి? మీ చరిత్రమును సవిస్తరముగాఁ దెలియఁ జేయుఁ'డని పల్కెను. అప్పు డా దివ్యపురుషుఁడు తన చరిత్రము నిట్లు చెప్ప నారంభించెను.

«ఓ బ్రాహ్మణోత్తమా! నాకుఁ బూర్వ జ్ఞానముండుట వలన నా చరిత్రమును సవిస్తరముగాఁ దెల్పఁగలను, వినుము. నేను బూర్వకాలమున జంబూద్వీపమునకు సార్వభౌముఁడనై యుంటిని. నన్ను సత్యకేతుఁడని పిలుతురు. నేను చంద్రవంశమునకు సంబంధించినవాఁడను. నాలుగువేల సంవత్సరములు రాజ్యమును బాలించి యుంటిని. బ్రాహ్మణుల కనేక దానములొసంగి యుంటిని. పెక్కు దేవాలయములను గట్టించితిని. వానికిఁగాను అనేక యగ్రహారములు ధారాదత్త మొనర్చి

యుంటిని. వివిధములైన యజ్ఞములు, యాగములు, మున్నగు వానిని లెక్కకు మిక్కిలిగా సల్పియుంటిని. ప్రజలను గడుపున బుట్టిన బిడ్డలవలెఁ గాపాడియుంటిని. అందఱిని నా యట్టివారుగనే భావించి యుంటిని. బుద్ధి పూర్వకముగా నొక్క దుష్కార్యమైనను జేసి యెఱుంగను. నాపరిపాలనమునందు జనులు కష్టమనునది యెఱుంగక సుఖజీవన మొనర్చిరి. ఎన్ని యున్ననేమి ? ఎంతటి సత్ప్రవర్తనము గలవాఁడైననేమి ? ఎన్ని ఘన కార్యము లాచరించిననేమి ? విధి కృతము తప్పదు గదా ?

ఇట్లుండ ఒకనాటిరాత్రి నా రాష్ట్రములోని ప్రజ లందఱే విధముగా నుండిరో, నన్నేవిధముగా భావించు చుండిరో, కనుగొందమని మారువేసమున బయలుదేరి పట్టణమునఁ దిరుగ నారంభించితిని. మహాత్మా! అప్పటి వఱకు నాయందు స్త్రీలోలత్వ మనునది లేదు. కాని విధి చెయ్దముల గుర్తింపఁ దరముగాదు. నేనట్లు దిరుగుచు నొక సందువీధిలోఁ బ్రవేశించితిని. అయ్యెడ సర్వాంగ సౌందర్యముగల యొక్క తరుణీమణి నాకుఁ గానుపించెను. ఆకాంత నిండు యౌవనవతియై యుండెను. ఆమెను గాంచినంతనే నాచిత్తము చలించినది. ఆమెపై నామనస్సు నిలిచి పోయినది. వెంటనే యామెను జేరఁజని యామెకు నాకోరిక నెఱింగించితిని. కాని యామె

సమ్మతింపలేదు. మాఱువేసమున నున్నవాఁడ నగుట వలన నన్నొక సామాన్యునిఁగా భావించి తిరస్కరించిన దామె యని యూహించినవాఁడనై, నానిజస్వరూపమును ఆమెకుఁ గానుపింపఁ జేసితిని. నన్ను రాజుగాఁ దెలిసికొని నంతనే యామె నిలువునఁ గంపింపసాగినది. నాకెట్టి ప్రత్యుత్తరమును ఇచ్చినదికాదు. అందువలన నామె సమ్మతించిన దని నాలో నేను భావించుకొని వెంటనే యామెను నాకౌఁగిటఁ జేర్చుకొంటిని. ఆమె కన్నులు మూతపడినవి. యుక్తాయుక్తముల గుర్తెఱుఁగక కామమోహితుఁడనై యామెను బట్టి సుఖించితిని. అనంతరము నేను గొంత దవ్వరుగు నప్పటికి ఆమె నోటి నుండి 'హా! రాజా! ఎంత దుష్కార్య మొనర్చితివి?' అను మాటలు నాకు వినవచ్చెను. తోడనే యామె చెంతకరిగి చూతునుగదా! మహాత్మా! ఏమి చెప్పుదును? ఆమె మరణించినది. అప్పుడు నా హృదయమునఁ బశ్చాత్తాప మంకురించినది. కాని లాభములేదు. ఆపాపమును అనుభవింపక తీరినదికాదు. అచిరకాలముననే నా సంపదలు నశించినవి. శత్రువులు నా రాజ్యమును గైకొని నన్ను అడవులకుఁ దరిమి వేసిరి. అచ్చోటఁ దలదాచుకొని యుండఁగా మరణము సంప్రాప్తమైనది. అప్పుడే యమభటులు నన్ను బంధించికొని యమలోకమునకుఁ గొంపోయిరి. ఆహా! మానుష మెంత మాత్రము అక్కఱకు రాదుగదా?

‘ఓవిప్రోత్తమా! ఆ యమలోకమందు నే ననుభవించిన బాధలను గూర్చి చెప్పఁ జాలను. అది జ్ఞప్తికి వచ్చినంతనే నా శరీరము కంపించిపోవుచున్నది. అనేకములైన నరకబాధల ననుభవించితిని. ఒకనాఁడా? ఒక వారమా? ఒక నెలా? ఒక సంవత్సరమా? పెక్కు సంవత్సరము లిట్లు నరకబాధల ననుభవించి తుదకు చాతకపక్షినై జన్మించితిని. ఆ జన్మాంతర మీ విధముగాఁ గుక్కనై పుట్టి యనేక జంతువులను జంపి, యుదర పోషణార్థమై యెన్నియో పాపముల నాచరించి యుంటిని. కాని మహానుభావా! నేటితో నా పాపము లన్నియు నశించినవి. మీ పవిత్ర పాదోదక స్పర్శవలన నేను పవిత్రుఁడ నైతిని. మీ సేవకుఁడు నాకు మహోపకార మొనర్చి యున్నాఁడు. ఆతని వలననే యీ దివ్యశరీరమును బొందితిని. మహాత్మా! మీపాదోదకమే యింతటి మాహాత్మ్యముఁగలదై యుండ, ఇంక మిమ్ము గూర్చి వేఱుగాఁ జెప్పనేల? స్వామీ! తమ సెలవైనచో నిప్పుడే ఆ వచ్చుచున్న విమానముపై నెక్కి వైకుంఠమునకుఁ బోయెదను.’

అని యీవిధముగా సత్యకేతుఁడు తన చరిత్రను ముగించునప్పటికి దివినుండి యొక విమానమువచ్చి యాతని చెంత నిలచెను. ఆతఁడును భద్రాత్మునివలన సెలవుపొంది

యగ్గావిమానము పై నెక్కి వైకుంఠమున కరిగెను. ఆహా! విప్ర పాదోదక మెంత మాహాత్మ్యము గలది? భద్రాత్ముఁడును సత్యకేతుని చరిత్రమునకు మిక్కిలి యద్భుతపడి, భగవంతుని చర్యలఁ గనుంగొన నెవ్వరి తరం బను భావంబున, భావంబు నంతయు నాపరాత్పరునియం దేనిలిపి యంతంబున మోక్షంబు నొందెను.

నీతి:—బాలకులారా! పరకాంతలనుబట్టి చెఱచుట మహాపాపము. దానివలన సర్వమును నశించును. మహాత్ము లగు బ్రాహ్మణుల నారాధించిన సర్వవిధముల మేలు గలుగును. అన్నిటికీ కథయే యుదాహరణమగుచున్నది.

---

## ౫. ధ్రువుని చరిత్రము.

(విష్ణుపురాణాంతర్గతము.)

బ్రహ్మ కుమారుఁడైన స్వాయంభువు మనువునకు, శతరూపయందు ఇద్దరు కుమారులు గలిగిరి. వారిలో మొదటి వాఁడు ప్రియంవ్రతుఁడు, రెండవ వాఁడు ఉత్తానపాదుఁడు. ఉత్తానపాదునకు ఇద్దరు భార్యలు గలరు. పెద్దభార్య పేరు సునీతి. రెండవ భార్య పేరు సురుచి. సునీతికి ధ్రువుఁడును,

సురుచికి ఉత్తముఁడును అను బిడ్డలు గలిగిరి. ఉత్తానపాదునకు మొదటి నుండియు సురుచిపై మిక్కిలి ప్రేమ. ఆమెయుఁ దన రూపలావణ్య విలాసముల చేతను, బరిపూర్ణ యౌవనము చేతను, ఉత్తానపాదుని సంపూర్ణముగా వశపఱచు కొనెను. అతఁడును ఆమె యాజ్ఞాప్రకారము వర్తించుచు, సునీతి మాటయే తలపెట్టకుండెను. ఇట్లుండ ఒకనాఁడు ఉత్తానపాదుఁడు సురుచి కుమారుఁడైన ఉత్తముని తనతొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని ప్రక్కనున్న భార్యతో ముచ్చటించు చుండెను. అట్టి యెడ ధ్రువుఁ డచ్చోటికి రుదెంచి తానుగూడఁ దన తండ్రి తొడపైఁ గూర్చుండఁ దలంచినవాఁడై జనకుని సమీపించెను. కాని సురుచియాతని యభిప్రాయముగని పెట్టి ధ్రువునకడ్డము వచ్చి 'కుమారా! నీవు నీతండ్రి తొడనెక్కఁ దలంచినచో నయ్యది నీకీజన్మమున లభింపఁ జాలదు. నాకడుపునఁ బుట్టినట్లైన నీకీ యదృష్టమబ్బియుండెడిది. సునీతికిఁ బుట్టినవాఁడ వగుటవలన నీకెందుఁ దావులేదు పొమ్ము.' అని గద్దించి పలికి యాతనిని నెట్టివైచెను. ఉత్తానపాదుఁడు భార్యమాటల కడుచెప్ప లేదు. పినతల్లియగు సురుచి యీవిధముగాఁ దన్నవమానించుటయు దానికిఁ దండ్రియైన ఉత్తానపాదుఁడు చూచి సహించుటయు ధ్రువునకు మిక్కిలి విచారమును గూర్చెను. కాని యేమిచేయఁ గలఁడు? కన్నుల నీరుగార్చుచుఁ దల్లియగు సునీతి యొద్ద కేగెను.

అట్లు వెక్కి వెక్కి యేడ్చుచుఁ దనకడ కరుదెంచిన సుతునిఁ గాంచి సునీతి మిక్కిలిగఁ బరితపించుచు, అతని వలన జరిగిన వృత్తాంతమునంతయుఁ దెలిసికొని 'నాయనా! ఏడ్చుట వలన లాభ మేమున్నది? పూర్వము మన మొనర్చిన కర్మ ఫలమును అనుభవింపవలదా? మన కెందును దిక్కు లేదు. అయినను దిక్కు లేని వారలకు దిక్కుగా నున్న శ్రీహరియే దిక్కై యున్నవాఁడు. ఆతని నమ్మినచో మానవునకు లభింపని దేదియునులేదు. కావున బిడ్డా! ఆ శ్రీమన్నారాయణుని నిశ్చలభక్తితో సేవింపుము. సకల శుభములును జేకూరును.' అని పలికి యాతనిని ఓదార్చెను. ధ్రువుండును దన తల్లి చెప్పిన ప్రకారము శ్రీహరిని మనంబున నిల్పినవాఁడై ఆ మహాత్ముని సేవింపఁ దలంచి యప్పుడే తన తల్లి వలన సెలవు గోలు వడసి మధువనంబున కరిగెను. ఆహా! బాలుఁడై నను ధ్రువుఁ డెంతటి కార్య దీక్ష గలవాఁడో పరికింపుఁడు! ఇట్టి వారల కలవి కాని దేది కలదు?

ధ్రువుఁ డట్లు మధు వనంబును జేరినంతనే యాతని యొద్దకు నారదుఁ డరుదెంచి శ్రీహరిని ఎట్లు ధ్యానింప వలయునో ఆ తెఱంగంతయు నాతనికిఁ దెలియఁ జేసెను. ధ్రువుండును నారదోపదేశ ప్రకారము శ్రీహరిని గూర్చి తపము చేయ నారంభించెను. నారదుండును, మధు వనంబునుండి

బయలుదేరి పుత్రునికై విలపించుచున్న ఉత్తానపాదుని కడ కరుదెంచి 'ఓరాజా! నీ వెంతమాత్రమును నీ కుమారునిఁ గూర్చి విచారింపవలదు. అతఁడు శ్రీమన్నారాయణుని గూర్చి తపము జేయుచున్నాఁడు. ఆమహాత్ముని వలన వరములను బొంది కొలది కాలముననే రాఁగలఁడు. అతనివలన నీకీర్తి ప్రకాశించును. అతనివలన నీవంశము తరించును. అతని వలన సమస్తమును సంతోషమును బొందును. నీ పుత్రుఁడు కారణ జన్ముఁడుగాని మానవ మాత్రుఁడు గాడు.' అని అనేక విధముల నచ్చజెప్పి యాతనికి దుఃఖోపశమన మొనర్చిన వాఁడై తిరిగి దేవలోకమున కరిగెను. ఉత్తానపాదుఁడును ధ్రువుని కొఱకెదురు చూడ సాగెను.

అచ్చోట మధువనంబున ధ్రువుండును, మొదటి నెల యందు మూడురోజుల కొకసారి ఫలాహారమును గైకొను చును, రెండవ నెలయందు జలమునే యాహారముగాఁ గైకొను చును, మూడవ నెలయందు వాయువునే యాహారముగాఁ గైకొనుచును, దుదకు రోజులు గడచిన కొలంది ఉచ్ఛ్వాస నిశ్వాసములనే బంధించి యోగమార్గమున నిలుచుచు, శ్రీహరినిఁ గూర్చి ఘోరముగాఁ దపము చేయసాగెను. ఒక్కొక్కప్పుడు ఒంటి కాలిమీదనే నిలువఁ జొచ్చెను. ఇట్లు కొన్ని వత్సరములు గడచు నప్పటికి అతని తపోవేడిమి దేవ

లోకము నంటెను. చతుర్దశ భువనంబులును గంపమొంద సాగెను. అట్టియెడ దేవేంద్రాది దేవతలు భయపడి అందఱును గలసి బ్రహ్మకడ కరిగి ధ్రువుని తపమును గూర్చియు, దాని వలనఁ దమకుఁ గలుగుచున్న బాధను గూర్చియు నాతనికి విన్నవించుకొనిరి. సృష్టికర్తయుఁ జేయునదిలేక వారలతోఁ గలసి వైకుంఠమున కరిగెను. వైకుంఠవాసుఁడగు శ్రీమన్నా రాయణుఁడు వారలఁ గాంచి యేతద్వృత్తాంతము ముందుగనే తెలిసికొన్నవాఁడై 'ఓ దేవతలారా! ధ్రువుని తపంబును గూర్చి మీరెంత మాత్రమును భయపడవలదు. ఆతనివలన మీకే హానియుఁ గలుగదు. ఆతనికి దేవేంద్రాధిపత్యము వలదు. నన్ను గూర్చియే యాతఁడు తపము సేయుచున్న వాఁడు. నే నిప్పుడే యాతని కడ కరిగి వలసిన వరంబు లొసంగి మీ యార్తిని బాపెదను. మీరింక మీ నివాసం బుల కరుగుఁడు.' అని బ్రహ్మేంద్రాది దేవతలను వీడ్కొల్పిన వాఁడై యా మహాత్ముఁ డప్పుడే లక్ష్మీ సహితముగఁ దన భక్తుని కడ కరిగెను. అహా! భగవంతుఁడగు శ్రీమన్నారా యణునకు భక్తులనిన ఎంతప్రేమయో తిలకింపుఁడు! అందు కనే గదా భక్త చింతామణి యని యాతనికిఁ బేరువచ్చినది? శ్రీహరిని నమ్మి చెడిన వారెవ్వరు గలరు?

ఆవిధముగా శ్రీహరి మధువనమును జేరునప్పటికి,

ధ్రువుండు యోగపరుఁడై యుండెను. ఆ బాలభక్తుని నిశ్చల హృదయమునకు లక్ష్మీనాథుఁడు సంతసించినవాఁడై తన మృదుహస్తముతో నాతనిని స్పృశించెను. అయ్యెడ నంత వఱకుఁ జైతన్యములేక పడియున్న ధ్రువుం డప్పుడు చైతన్యమును బొందినవాఁడై, కనులు దెఱచి ఎదుట సాక్షాత్కరించి యున్న శ్రీహరిని దిలకించి పట్టరాని సంతసంబున వచ్చియు రాని మాటలతోడను, దెలిసియుఁ దెలియని భావములతోడను ఆమహాత్ముని స్తుతింపసాగెను. క్షణక్షణమునకు ఆతని శరీరమంతయుఁ బులకరింపసాగెను. ప్రపంచమంతయు ఆనంద స్వరూపమున నాతనికిఁ గన్పడసాగెను. తన్మయత్వ మినుమ డించుచుండెను. కనులవెంట బాష్పధారలు ప్రవహింపఁ జొచ్చెను. అట్టి స్థితియందున్న ధ్రువుని మెల్లన జేరఁదీసి శ్రీహరి ‹కుమారా! నీ వెందు కీవిధముగాఁ దపము సేయు చున్నదియు, నీహృదయమున నే కోరికయున్నదియు నాకుఁ దెలియును. ఎవ్వరికిని లభ్యముగానట్టి ఉత్తమ పదవిని నీవు గోరుచున్నావు. అది నీకుఁ దప్పక సమకూర్చెదను. గ్రహ ములు, నక్షత్రములు, సప్తమహాఋషులు, ఇంద్రాది దేవతలు దేనికిఁ బ్రదక్షిణము సేయుచున్నారో, అట్టి ధ్రువపదంబునే నీకొసంగెదను. అది ప్రళయకాలమునందైనను నశించునది కాదు. అద్దానిని ఇప్పు డెంతమాత్రమును నీవు పొందఁ

జాలవు. నీ తండ్రి యనంతరము నీవు అరువదివేల సంవత్స రములు రాజ్యపరిపాలన మొనర్పనున్నావు. నీ సోదరుఁడైన ఉత్తముఁడు వేటకుఁబోయి అడవిలో మృతినొందును. పుత్ర శోకమున ఆతని తల్లియగు సురుచియు మరణించును. నీ వొక్కఁడవే నీ తండ్రి వంశమున కాధారభూతుఁడవగు దువు. నీ పరిపాలనము ధర్మమార్గము నంటియుండును. నీవనేక యజ్ఞములు చేసెదవు. ఇదిగో! ఎల్లప్పుడు నీ హృద యము నాయందే లగ్నమై యుండు నటుల వరంబొసంగు చున్నాను. నీరాజ్య పరిపాల నానంతరము శాశ్వతమగు పదంబును బొందఁ గలవు. అంతేటినుండి అయ్యది ధ్రువ మండలమను పేరున నిలువఁ గలదు. కుమారా! ఇంక నీ తపస్సును జాలించి యింటికేగుము. నీకై నీతండ్రి యెంతేయో దిగులు పడియున్నవాఁడు. ఓ బాలతాపసీ! బాలుఁడ వయ్యును మనస్సును నిగ్రహించితివి. బాలుఁడ వయ్యును గార్య దీక్షను వహించితివి. బాలుఁడవయ్యును ఇంద్రాది దేవత లను భయపడఁ జేసితివి. బాలుఁడవయ్యును ముని పుంగవు లకు సిగ్గులు ఘటించితివి. వేయేల? బాలుఁడ వయ్యును నన్ను సంపూర్ణముగా లోఁ బఱచు కొంటివి. తండ్రీ! నీ వలన భక్త లోకము మిక్కిలి వన్నె కెక్కినది. ఇంక గృహాముున కరుగుము. రాజ్య భోగముల ననుభవింపుము.' అని యనేక

విధముల నా బాలభక్తుని బుజ్జగించి వీడ్కొలిపినవాఁడై తా నదృశ్యుఁ డయ్యెను.

ధ్రువుఁడును శ్రీహరిని అనేక విధంబులఁ గీర్తించుచు అచిరకాలముననే పురమును బ్రవేశించెను. పుత్రునికై యెదురు సూచుచున్న ఉత్తానపాదుఁడు కుమారుని ఎదురొ్కొని, కొని వచ్చి, యొక శుభ ముహూర్తంబున రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁగా నొనర్చి తాను దపోవనంబున కరిగెను. ధ్రువుఁడును శ్రీహరి యాజ్ఞా ప్రకారము అరువదివేల సంవత్సరములు ధర్మమును దప్పక రాజ్యమును బాలించి, యంతమునఁ దనకై యుంచఁబడిన పదమును బొందెను. ఇతఁడు నిలచి యున్న చోటునే ధ్రువమండలమనియు, ఇతనినే ధ్రువనక్షత్రమనియు మన మిప్పటికిని బేర్కొనుచున్నాము.

నీతి:—బాలకులారా! కార్యదీక్షయు, స్థిర బుద్ధియు నున్నచో బాలకులైనను, దుస్సాధ్యములగు పనులను సాధింపఁ గలరు. దీనికి ధ్రువుని పట్టుదలయు, స్థిర బుద్ధియు, సాక్షీభూతము లగుచున్నవి.

# ౬. పృథుచక్రవర్తి చరిత్ర.

(విష్ణుపురాణాంతర్గతము.)

పూర్వకాలమున అంగరాజు అను ఒక భూవిభుఁడు గలఁడు. ఆయన మంచిగుణములు గలవాఁడు. ప్రజలను గన్న బిడ్డలవలెఁ గాపాడుచుండెడివాఁడు. ఆయన భార్యపేరు నిశీధ. అంగరాజు మిక్కిలి మంచి గుణములు గలవాఁడై యున్న ప్పటికి, ఆతనికి సంతాన మనుమాటయే లేకుండెను. అందు వలన ఆయనకు మనస్తాపము ఎక్కువగాఁ జొచ్చెను. బిడ్డలు లేనివాఁడగుట వలన ఆయన యజ్ఞములు సేయుచున్నప్పుడు తమతమ హవిర్భాగములను గొనుటకు దేవతలు రారైరి. ఏమి చేయుటకు దోచక తనకు సంతానము ఏవిధముగాఁ గలుగునో చెప్పవలసినదని గురువులగు ఋషిపుంగవుల నడి గెను. వారును గొంత తడవు విచారించి పుత్రకామేష్ఠిచేయ వలసినదని తెలియఁజెప్పగా అంగరాజు సక్రమముగా నా క్రతువు నొనర్చి తన్కాలమునఁ దన భార్యయగు నిశీధ యందు ఒక కుమారునిఁ గాంచెను. ఈబిడ్డకు వేనుఁడని పేరు పెట్టిరి.

వేనుఁడు మృత్యుదేవత యంశమువలనఁ బుట్టిన వాఁ డగుటవలన బాల్యమునుండియే తనతోడనాటలాడు బాలురఁ

బట్టి క్రూరముగా శిక్షింపసాగెను. ఎన్నియో చెడు పనులఁ జేయసాగెను. యుక్తవయస్సు వచ్చినది మొదలు, క్షత్రియ కుమారుఁడగుటవలన వేట కరిగి, యచ్చోట సాధుమృగం బులఁబట్టి మిక్కిలిగా హింసింపసాగెను. ఒక్కొక్కప్పుడు గోవులనుగూడ హింసింపసాగెను. తన మాటకు ఎదురు జవాబు సెప్పినవారలను, ఇది తగదని నీతి గరపినవారలను, తన యాజ్ఞను శిరసావహింపనివారలను, క్రూరముగా శిక్షింప సాగెను. వేయేల? ఆతఁ డొనర్పని దుష్కార్యమే లేకుండెను. లేకలేక కలిగిన కుమారుఁడిట్లు దుర్మార్గుఁడగుటకు అంగరాజు మిక్కిలిగాఁ జింతింపసాగెను. ఆతని దుష్టబుద్ధిని మరల్పవల యునని ఎన్నియో నీతులను బోధించెను. ఒక్కొక్కప్పుడు దండోపాయమును గూడఁ గుమారునియెడ వినియోగింప సాగెను. కాని ఆతని దుస్స్వభావము మారినదికాదు. నానా టికి మఱింత యెక్కువకాఁజొచ్చెను. అంగరాజునకుఁ బుత్రు నిపై నసహ్యాభావము జనించెను. తన కుమారునివలననే తన ప్రజలు బాధలకు లోనగుచుండ నాతండు చూచి సహింప లేక పోయెను. ఒక వంక ప్రజలను గూర్చిన విచారము— మఱొక వంక పుత్రునిపై నసహ్యాభావము—ఇనుమడింప అంగ రాజు దిక్కు దెలియనివాఁడై యొకనాఁటి రేయి ఇతరులకుఁ దెలియకుండ రాజ్యమును విడచి, ఎచ్చటికో యరిగెను. మఱునాఁడు రాజునుగానక, రాణి, మంత్రులు, మొదలగు

వారందఱును, అతనికై యనేక చోట్ల వెదకించిరి. కాని లాభములేక పోయెను. అందువలన రాజు లేక పోయినచో రాజ్య మరాజకమగునని తలంచి, ఋషులు, మంత్రులు, ప్రజలు, మున్నగు వారందఱును, వేనునకుఁ బట్టాభిషేక మొనర్చిరి. వేనుఁడు క్రూరుఁడని తెలిసియున్నను, అట్టి యెడ వేఱు మార్గము లేకుండుటవలన అందఱును ఆతని రాజ్యాధి పత్యమునకు ఒప్పుకొనిరి.

తనకు రాజ్యాధిపత్యము వచ్చినది మొదలు వేనుఁడు మఱింత దుర్మార్గుఁ డయ్యెను. తన కంటికి నచ్చినట్టి కాంత యగపడినచో నామెను బట్టి బలాత్కారముగనైన చెరుప సాగెను. ఎవ్వరేని అడ్డము వచ్చినచో నట్టి వారల నప్పుడే తుద ముట్టింపుచుండెను. ఒక్కొకప్పు డన్యాయముగాఁ బ్రజల యిండ్లపైఁ బడి దోచుకొన సాగెను. రాజ్యమున ఎచ్చోటఁ జూచినను జార చోరులు ప్రబలసాగిరి. ఎచ్చోట జూచినను గల్లోలములు మెండుగాఁ జొచ్చెను. ప్రజలయందు శాంతి యను మాటయే లేకుండెను. వేనుఁడెవ్వరిని లక్ష్యపెట్టకుండెను. ఇట్లు కొంతకాలము గడచు నప్పటికి వేనుని దుష్ప్రవర్తనము మఱింత ప్రబల మయ్యెను. యజ్ఞయాగాది క్రతువుల యందు హవిర్భాగములఁ దనకే యొసంగ వలసిన దనియు, దేవతల కెంతమాత్రము నీయరాదనియు, నిట్లొనర్పక ఎవ్వరేనిఁ దన

యాజ్ఞ నుల్లంఘించినచో నట్టివారలు కఠినముగా దండింపఁ బడుదు రనియుఁ దెలియఁ జేసెను. అందువలన అంతవఱకు సహించియున్న మునులకుఁ గోపము మిక్కుటముగాఁ గలిగెను. అందఱును ఒకచోటఁ జేరి 'ఆహా! ఈతని దుష్ప్రవర్తనము నానాటికి మించి పోవుచున్నదే! కానిమ్ము. తగిన నీతిని గరపుదము. వినినచో సరియే. వినకున్న అప్పుడే శిక్షింతము.' అని తమలోఁ దాము నిశ్చయించుకొని వేనుని కడ కరిగి 'ఓ రాజా! నీవీ రీతిగా జనులను బాధించుటతగదు. మా యజ్ఞయాగాది క్రతువుల నడ్డగించుటయుఁ దగదు. నీ దుష్టబుద్ధిని వీడి మంచి మార్గమునకు రమ్ము. లేకున్న నీ ప్రాణములు దక్కవు.' అని కఠినముగాఁ జెప్పిరి. కాని వారి మాటలను వేనుఁ డెంతమాత్రమును లక్ష్యము సేయక 'ఓహో! మీరేనా నన్ను జంపునది?' అని పరిహాస మొనర్పసాగెను. అప్పుడు ఋషులందఱును మండిపడుచు 'దుర్మార్గుడా! తర మెఱుంగక పరిహాసించెదవా? నీ విప్పుడే విగతజీవుఁడవై పోయెదవుగాక!' అని పలికిరి. ఆ క్షణముననే వేనుఁడు ప్రాణములను బాసెను. ఆహా! ఋషుల వాక్యములు అమోఘములుగదా? నాఁటితోఁ బ్రజల యొక్క కష్టములన్నియు నంతరించి పోయెను.

కుమారుని మరణమునకు నిశీథ మిక్కిలిగ విలపింపసాగెను. బిడ్డయొక్క మృతశరీరమును గాంచినయైన గొంత

వలెఁ దన సంతాపమును మాన్పుకొనవచ్చునోయను నట్లు కుమారుని కళేబరమును ఒక్కచో భద్రముగా నుంచెను. వేనునకుఁ బుత్రు లెవ్వరును లేకుండుటవలన నాతని తరువాత రాజ్యమునకు వచ్చు వారొక్కరును లేకుండిరి. అప్పటి స్థితి గతులను బట్టిచూడ రాజ్య మరాజక మగునట్లుండెను. అప్పుడు మంత్రులు, ప్రజలు మున్నగువారందఱును రాజ్యసంరక్షణ మొనర్పవలసినదని మునిపుంగవులను బ్రార్థింపగా వారును వల్లెయని, తమ మంత్ర ప్రభావంబువలన వేనుని మృతశరీరము నుండి యొక పురుషునిఁ బుట్టించి యాతనికిఁ బృథురాజని పేరు పెట్టిరి. ఈ పృథురాజు కేవలము విష్ణుమూర్తి యంశ మునఁ బుట్టినవాఁడగుటవలన బాల్యమునుండియే తన సత్ప్రవర్తనమును అందఱికిని విశదపఱుప సాగెను. కాలక్రమము ననుసరించి యితఁడు యుక్తవయస్కుఁ డయ్యెను. అప్పుడు ప్రజల యభిప్రాయము ననుసరించి ఋషు లాతనికిఁ బట్టము గట్టి పరిపాలనావిధిని జక్కగ బోధించిరి.

వేనుని దుష్ప్రవర్తనమువలన దేవతలు కోపించి సకాలమునకు వర్షమును గురియింపరైరి. అందువలన భూమి ఫలింపదయ్యెను. భూమి ఫలింపక పోవుటచేత రాష్ట్రమున క్షామము మెండయ్యెను. ప్రజలు తినుట కన్నములేక మిక్కిలిగా బాధపడసాగిరి. ఈస్థితియందే పృథుచక్రవర్తి రాజ్యము

నకు వచ్చెను. ప్రజల కష్టములను బాపకున్నచోఁ దన పరిపాలనము నిష్ఫలమని తలంచినవాఁడై యాతఁడు అనేక యజ్ఞముల నొనర్చి దేవతలను సంతోషింపఁజేసెను. వారును బృథుచక్రవర్తి సత్ప్రవర్తనమునకు మెచ్చుకొని సకాలమునకు వర్షములను గురియింపసాగిరి. కాని భూమి ఫలింపదయ్యెను. వర్షములు గురిసినప్పటికి భూమి ఫలింపకుండుటకుఁ గారణమేమా యని అతఁడు పెక్కువిధముల నాలోచించి భూదేవికిఁ గూడ సంతోషమును గలిగింపనెంచి యనేక విధముల ఆ మహాతల్లిని బూజించెను. కాని అప్పటికిని భూదేవి శాంతింపలేదు. తనయందు లీనమైయున్న ఓషధులను బెంపొందింపఁ జేయలేదు. ప్రజల కష్టములు అంతరించలేదు. రాష్ట్రమున నానాటికిఁ గరువు ప్రబలము గాఁజొచ్చెను. అన్నమో రామచంద్రాయని ప్రతివారును విలపింపసాగిరి. పృథుచక్రవర్తికి మనస్తాప మినుమడింప సాగెను.

ఇట్లు తన ప్రయత్నము లన్నియు నిష్ఫలము లగుచున్నందువలనఁ బృథుచక్రవర్తి మిక్కుటకోపమును వహించినవాఁడై భూమిని బెకల్చి సస్యములఁ గొనితెచ్చుటకుఁ బ్రతిజ్ఞఁ గైకొనెను. అతని దృఢప్రతిజ్ఞకును, అతని సాహసమునకును, భూదేవి భయపడి, గోరూపమును ధరించి సత్యలోకమునకుఁ బారిపోయెను. పృథుచక్రవర్తియుఁ దన పట్టుదలను వదలక

వింటబాణమును సంధించి భూదేవిని వెంబడించెను. సత్య లోకమునఁ దనకు రక్షణము లభింపకపోవుటవలనఁ గైలాస మునకుఁ బరుగిడెను. అచ్చోటను దిక్కులేక పోవుటవలన వైకుంఠమున కరిగెను. అప్పుడు శ్రీమహావిష్ణువు భూదేవినిఁ గాంచి 'ఓసాధ్వీ! పృథుచక్రవర్తి నాయంశమున జన్మించి యుండెను. కావున నే నాతనియెడ విరోధ మూనఁజాలను. నీవాతనినే శరణంబు వేడుము. ఒరులు నిన్నెంతమాత్రమును రక్షింపజాలరు.' అని తెలియఁజేయ భూదేవియుఁ జేయునది లేక తన్ను వెన్నంటి వచ్చుచున్న పృథుచక్రవర్తి నెదుర్కొని 'ఓమహానుభావా! నన్ను జంపవలదు. నేనిప్పుడు గోరూప ముతో నున్నదానను. నాపాలు పిదుకుము. దాని వలన నీయభిమతము లన్నియు నీడేరఁగలవు. నన్ను రక్షింపుము.' అని పలుక పృథుచక్రవర్తియు నామె చెప్పిన ప్రకారమే యొనర్చి,సర్వజనులకు వలసిన వాని నన్నిఁటిని సమకూర్చెను. నాటనుండి, ఈచక్రవర్తిపేర భూమికిఁ 'బృథ్వి'యను నామము గలిగెను. ఇట్లు జనులకు వలసినవి యెల్ల సమకూర్చి ధర్మ మార్గమును దప్పక పెక్కు సంవత్సరములు రాజ్యమును బాలించి, యంతంబున, విష్ణునంశంబునఁ బుట్టినవాఁడగుట వలన, ఆమహాత్మునియందే లీనమయ్యెను. ఆహా! ఆచక్రవర్తి పేరిప్పటికిని భూమిమీద నిలచియున్నది కదా?

నీతి:—బాలకులారా! పరులను హింసించు వారు సమూలముగా నశింతురు. పరులను గాపాడువారు సర్వవిధ

ములఁ బేరుగాంతురు. ఈ రెంటి కీ కథయే యుదాహరణ మగుచున్నది.

---

## ౭. సౌభరి చరిత్రము.

(విష్ణుపురాణాంతర్గతము.)

పూర్వము యువనాశ్వుఁడను ఒక రాజు గలఁడు. ఈయన కకుత్థ్సవంశమునకు సంబంధించినవాఁడు. మొదటి నుండియు నితఁడు సత్ప్రవర్తనమునందుఁ బేరెన్నికఁ గన్నవాఁడు. కాని సంతాన విహీనుఁడు. సంతానమును బడయుటకై యితఁ డెన్నియో సత్కార్యముల నాచరించెను. కాని ఒక్కటియును గలసి వచ్చినదికాదు. తుదకు మనుష్య ప్రయత్నము వలన లాభము లేదని తలంచినవాఁడై, భార్యతోఁ గలసి తపోవనమున కరిగెను. అచ్చోట ముని పుంగవులకు శుశ్రూషలు సేయుచుఁ దన సత్ప్రవర్తనంబు వలన వారల ప్రాపును బడసి తన కోరికను వారికిఁ దెలియఁ జేసెను. వారును ఆత నిపైఁ గరుణవహించి కొంతజలమును మంత్రించి 'ఓ రాజా! రేపటి యుదయమున ఈ జలమును నీ భార్య కిమ్ము. దీనివలన నీ కొకకుమారుఁడు గలుగును. ఆతనివలన నీ వంశమున

మంచి పేరు వచ్చును. అని చెప్పి యా జలమును ఆతని కొసం గిరి. యువనాశ్వుఁడును దన కోరిక నెరవేరినందుకు సంతస పడసాగెను. ఏ గడియ కేది కలుగునో మానవుఁడు గుర్తింప నేరఁడుగదా ? ఆ నాటి రేయి, అర్ధ రాత్రి సమయమున యువ నాశ్వునకు మిక్కిలి దాహమయ్యెను. అట్టియెడ ఋషుల వాక్యమును మఱచి, వారు మంత్రించి యిచ్చిన జలమునే త్రాగెను. కాని తపోధనుల వాక్యములు నిరర్థకములు గానేరవుగదా ? ఆ జలమును ఆతఁడు త్రాగుటవలన లోక విరు ద్ధముగా నాతఁడే గర్భమును ధరించెను. క్రమ క్రమముగా నవమాసములు పూర్తియయ్యెను. అప్పుడు యువనాశ్వుఁడు మునుల కడకరిగి అంతయును దెలియఁ జేసెను. వారును దైవ ఘటనమునకు ఆశ్చర్యపడుచు యువనాశ్వుని రక్షింపఁ దలంచి, యాతని గర్భములో నున్న శిశువు ఆతని కుడిప్రక్క చీల్చుకొని బయటికి వచ్చు నట్లును, దానివలన ఆతనికే మాత్రము హానికలుగకుండు నట్లును, అనుగ్రహించుటయే గాక, అట్లు పుట్టిన బిడ్డకు, బొటన వ్రేలియందు అమృతమును నుత్పాదింపఁ జేసి, ఆవ్రేలు పానము సేయుచు నా శిశువు జీవించు నట్లును ఒనర్చిరి. ఈ విధముగా ఋషుల వరబలంబు వలన యువనాశ్వుఁడు కుమారునిఁ గాంచి భార్యతోఁ గలసి తన నగరమునకు వచ్చెను.

యువనాశ్వుఁడు తన కుమారునకు మాంధాత యని పేరు పెట్టెను. మాంధాతయు మొదటినుండి అమృతపానము వలనఁ బెరిగినవాఁడగుటవలన బలము, ఔదార్యము, సాహసము, పౌరుషము మున్నగువానియందుఁ దనకు సాటిలేనివాఁడై యభివృద్ధి నొందెను. అతనికి యుక్తవయస్సు వచ్చినంతనే యువనాశ్వుఁడు కుమారునకుఁ బట్టముగట్టి భార్యతోఁ దపోవనంబున కరిగెను. మాంధాతయు రాజ్యమునకు వచ్చినది మొదలు న్యాయమును దప్పక ప్రజాపరిపాలన మొనర్చుచు, ఎదురులేని బలముగలవాఁడగుటవలన శత్రురాజులను బెక్కుమందిని జయించి చక్రవర్తియని పేరొందెను. ఐశ్వర్యమునకుఁ దోడతనికి ముచికుందుఁడను ఒక కుమారుఁడును, బెక్కుమంది కుమార్తెలును గలిగిరి. ఈవిధముగా మాంధాత చక్రవర్తి సకలసంపదలతోఁ దులదూగుచు రాజ్యపరిపాలన మొనర్చుచుండెను.

ఇట్లుండగా సౌభరి యను మహర్షి ఒకనాఁడు మాంధాత చక్రవర్తి కడ కరుదెంచెను. అతఁడును ఆమహాత్ముని సర్వవిధముల గౌరవించి వచ్చినపని యేమని అడిగెను. అప్పుడు సౌభరి అతనిఁ గాంచి "రాజా! నేను వచ్చినపనిఁ దెల్పెద వినుము. ఒకనాఁడు నేను నదియందు స్నానము చేయుచుండగా, ఒక మీన మిథునము నాకు దృగ్గోచరమయ్యెను.

ఆ చేపలు రెండును గలసి పెక్కు గతుల సంసారసుఖ మును అనుభవించు చుండెను. వానిని గాంచి నంతనే అకారణముగా నా మనస్సు చలించి, సంసారముపైఁ గోరిక జనించినది. సంసార సుఖమును అనుభవించు టకు సౌందర్యవతులగు తరుణు లుండవలయును గదా! కావున నాకోర్కెను దీర్చుకొనుటకై నీయొద్దకు వచ్చితిని. నీపుత్రికలలో నొక్కరిని నాకిచ్చి వివాహము సేయుము. ఇదియే నావచ్చినపని.' అని తెలియఁజేసెను. మాంధాతకు నెత్తిమీఁద పిడుగు పడి నట్లయ్యెను. ఇచ్చుటకు మనస్సు ఒప్పదు. కాదని తిరస్కరించుటకు ధైర్యము చాలదు. ఏమి చేయుటకును దోచక తుదకు 'మహాత్మా! క్షత్రియ ధర్మము ననుసరించి రాకుమారికలకు స్వయంవర వివాహము విధ్యు క్తమై యున్నది. ఇది మీకు మాత్రము తెలియనిదా? వరుని నిశ్చయించు కొనుటయందు వారే స్వతంత్రులు. కావున నేనెట్లు సాహసింపఁగలను. నాపుత్రికలలో నెవ్వరైనను మిమ్మును వరించినచోఁ దప్పక మీకిచ్చి వివాహ మొనర్పఁ గలను. ఇట్లంటినని నాపైఁగినియకుఁడు. స్వామీ! కులాచార మును మీరుట తగినది కాదుగదా!' అని సవినయముగాఁ బలుక సౌభరియు దానికి సమ్మతించి 'రాజా! నీకుమార్తెలకు స్వయంవరమును జాటింపుము. విధిప్రకార మన్నియు జరుగఁ

గలవు. సంసారసుఖప్రాప్తియు, నీపుత్రికయొక్క పాణిగ్రహణ
మును, నాకు విధికృతములై యున్న నీవు తప్పింపఁజాలవుగదా?
అని పల్కెను. మాంధాతయు నమ్మహాత్ముని యాజ్ఞ ప్రకా
రము అప్పుడే కుమార్తెలకు స్వయంవరమును జాటించెను.
దైవ సంకల్ప మెట్లున్నదో గదా!

స్వయంవర మంటపమున రాకుమారులు క్రిక్కిరిసి
యుండిరి. సకాలమునకు మాంధాత చక్రవర్తి కుమార్తెలంద
ఱును బూలదండలఁగొని మంటపమును బ్రవేశించిరి. మిక్కిలి
సౌందర్యవతులగు నా కన్యకలను గాంచినంతనే ప్రతివారును,
ఆకన్యక తన్ను వరించుననియు, ఆకన్యక తన్ను వరించు
ననియు, ఆకన్యక తన్ను వరించుననియుఁ దలంచుకొనసాగిరి.
సౌభరియు నొక చోట సుఖాసీనుఁడై యుండెను.
అట్లు ఆ కన్యకా మణులు స్వయంవర మంటపమును బ్రవే
శించినంతనే సౌభరి తన తపోమహిమవలన నవమన్మథా
కారుఁడై వారలకుఁ గన్పడ సాగెను. ఇతరులకు మాత్రము
ఎప్పటి యట్లే కన్పడుచుండెను. ఆ కన్యకలు, కేవలము మన్మ
థాకారముతో వెల్గుచున్న సౌభరిని గాంచి నంతనే మనస్సు
చలించినవారై, అందఱును ఆతనినే వరించిరి. దానికి రా
కుమారు లందఱును ఆశ్చర్యపడిరి. కొంతవడికి ఈర్ష్యాపర
వశులైరి. మాంధాత చక్రవర్తియుఁ దన కుమార్తెల యొక్క

కృత్యమునకు అసంతృప్తిని జూప సాగెను. పరిస్థితు లన్నియు నిట్లుండుట వలన సౌభరి సర్వమును గ్రహించినవాఁడై యందున్న రాకుమారుల నందఱిని గాంచి 'ఓ రాకుమారు లారా! రాకుమార్తెలు కురూపుఁడగు జడ దారిని వరించి రేమాయని మీ రాశ్చర్య పడవలదు. నాపై మత్సర భావ మూన వలదు. మీ రన్ననో భుజబల సంపన్నులు. మే మన్ననో వాగ్బల సంపన్నులము. ఒకప్పుడు మీ భుజ బలమునకు ఎదురుండ వచ్చును. కాని మా వాగ్బల మట్టిది కాదు. అయ్యది అమోఘము. మా తపశ్శక్తి యెట్టిదో మీకుఁ దెలి యక పోవుటవలన మీరిట్లు తలంచుచుంటిరి. ఇదిగో మా శక్తిని దిలకింపుఁడు' అని తన మన్మథాకారము వారలకు గూడ దృగ్గోచరమగు నట్లొనర్చెను. ఆ యతులిత సుందరా కారమును గాంచి రాకుమారు లందఱును నివ్వెఱపడి తలలు వంచుకొనిరి. మాంధాత చక్రవర్తియుఁ దన దురభిప్రాయము నకుఁ బశ్చాత్తాపము నొంది, అంతటి మహాత్ముఁడు తన కల్లుఁడై నందుకు సంతస పడుచు, అప్పుడే తన కుమార్తెల నందఱిని ఆతని కొసంగి విధ్యుక్తముగా వివాహము నొనర్చెను. సౌభరియుఁ దన భార్యలఁ దోడ్కొని వనంబున కరిగి యచ్చోట వివిధ రూపములతో వారల వలన సంసార సుఖ మును అనుభవించుచు, సంసారమునకు దూరస్థుండై, తన జీవితమును గడుప సాగెను.

నీతి:—బాలకులారా! తపోనిధులకు సాధ్యములుగాని పనులెవ్వియును లేవు. వారు తలంచినచో ఈ సర్వప్రపంచమును దలక్రిందు సేయఁ గలరు. దీనికి సౌభరియే సాక్షీభూతుఁ డగుచున్నాఁడు.

---

## ౯. కల్మాషపాదుని చరిత్ర.

(విష్ణుపురాణాంతర్గతము.)

పూర్వకాలమున మిత్రసఖుఁడను ఒక రాజుండెను. ఇతఁడు పవిత్రమైన ఇక్ష్వాకువంశమునందుఁ బుట్టినవాఁడగుట వలన మొదటినుండియు మంచి నడత గలవాఁడై యుండెను. దీనికిఁ దోడు మిత్రసఖుఁడు భుజబలమునందు అద్వితీయుఁడై యుండెను. ఈయన రాజ్యమునకు వచ్చునప్పటికి దేశమునందు రాక్షసులబాధ మిక్కుటముగా నుండెను. అందువలన బ్రజలందఱును బెక్కుకష్టములకు లోనై యుండిరి. అప్పుడు మిత్రసఖుఁడు ప్రజలకష్టములను బాపనెంచి యెదురులేక విచ్చలవిడి విహరించుచున్న రాక్షసులపై దాడి వెడలి పెక్కు దినములు వారలతో ఘోరయుద్ధము లొనర్చి తుద కందఱిని నశింపఁజేసెను. అంతేగాక 'రాక్షసుఁడు' అన్నమాట తనకు వినఁబడినంతనే అట్టివానిని దన రాజ్యము లోనికి రానీయక

పాఱద్రోలుచుండెను. మిత్రసఖుని మాట వినవచ్చినంతనే రాక్షసులుగూడ మిక్కిలిగా భయపడసాగిరి. కాని ఆతనిపైఁ దీరని శత్రుత్వమును వహించి సమయము లభించినచో ఆతనిని మొదలంటఁ గూల్పవలయునని సంకల్పించుకొనియుండిరి.

ఈవిధముగా రాక్షసులను నశింపఁజేయుచుఁ బ్రజలకు గష్టమనునది లేకుండ మిత్రసఖుఁడు రాజ్యమును బాలించుచుండెను. అది యేమి పాపమో గాని, ఈతనికి సంతానమనునది లేనేలేదయ్యెను. దేవతలను దృప్తిపఱచిన సంతానము గలుగునేమోయని యనేక దేవతాకార్యము లొనరించెను. అనేక దేవాలయములను గట్టించెను. బ్రాహ్మణులకు అనేక భూదానములను గావించెను. అడిగినవారికి లేదనకుండ దగినట్లు సహాయమొనర్చెను. కాని యెన్ని యొనర్చినను, ఆతనికి సంతానము గలిగినది కాదు. మిత్రసఖునకు రోజులు గడచిన కొలఁది మనస్తాప మెక్కువ కాఁజొచ్చెను. సంతానము గలుఁగదేమో యని ఆతఁడు దిగులుపడసాగెను. కాని యేమి చేయఁగలఁడు? ఇది మానవప్రయత్నమునకు అతీతమైనది గదా?

మిత్రసఖుని మనోవిచారమును సమగ్రముగా గుర్తెఱిఁగి ఇక్ష్వాకు కులగురుండైన వసిష్ఠమహాముని ఒకనాఁడతని యొద్దకుఁజని «రాజా! సంతానము కొఱకై నీవింతగా దిగులు

'పడనేల? నీవిప్పుడే పుత్రకామేష్టి అను యజ్ఞమును ఆచరిం పుము. తపోనిధులమగు మేమందఱమును నీకుఁదోడుగా నుండెదము. ఈయాగాంతమున నీకుఁబుత్రసంతానము గలుగఁ గలదు. ఎంతమాత్రమును దిగులు పడకుము.' అని తెలియఁ జేసెను. గురుని వాక్యానుసారము మిత్రసఖుఁడు అచిర కాల మున నే యజ్ఞదీక్ష గైకొనెను. ఆయజ్ఞమునకు వసిష్ఠుడు అధ్వ ర్యుఁడుగా నుండెను. తక్కిన ఋషులందఱును సహాయ భూతులై యుండిరి. సకాలమునకు యజ్ఞ మారంభింపఁబడెను. అట్టి సమయమున రాక్షసులందఱును మిత్రసఖుని యజ్ఞమును బాడు సేయవలయునని ప్రయత్నింపఁ జొచ్చిరి. కాని ఒక్కరికిని ధైర్యము చాలకుండెను. కొందఱు ఋషులెక్కడ శపింతురో యని భయపడిరి. మఱికొందఱు మిత్రసఖుని గూర్చి భయ పడిరి. కాని తమ నిశ్చయమును మాత్రము వదలకుండిరి. ఈలోపల యజ్ఞము సక్రమముగా ముగింపఁబడెను. ఋషు లందఱును దగిన విధమున సత్కారములనంది తమ తమ యాశ్రమముల కరిగిరి. సత్కరింపఁ బడవలసిన వాడు వసిష్ఠు డొక్కఁడు మాత్రమే మిగిలియుండెను. అట్టియెడ ఒకనాఁడు వసిష్ఠుఁడు లేని సమయమున ఒక రాక్షసుఁడు వసిష్ఠుని రూప ముతో మిత్రసఖుని జేరంజని 'ఓరాజా! నీయజ్ఞము చక్కఁగా ముగింపఁబడినది. అందఱును నీవొనర్చిన సత్కారములకు

సంతోషించిరి. నాకుఁగూడ యజ్ఞదక్షిణగా నరమాంసముతో భోజనముఁ బెట్టించి సంతోషమును గూర్పుము. ఇదియే నీవు నాకొనర్పవలసిన సత్కారము. దీనివలన నేను సంతోషించెదను. ఇటులొనర్పకుంటివా నీకు సంతానము గలుగక పోవుటయేగాక మీఁదుమిక్కిలి నాకోపాగ్ని జ్వాలలకు గురికాఁగలవు. కావున నాకోర్కను రేపటిదినమున తప్పక నెఱవేర్పుము.' అని తెలియఁజేసి, మిత్రసఖునివలన 'సరే' యనిపించుకొని యారాక్షసుఁడు తన నివాసమున కరిగెను. పాపము! మిత్రసఖుని గతిముందేమగునో గదా?

మఱునాఁడు మిత్రసఖుఁడు మాయా వసిష్ఠుఁడగు రాక్షసుని పల్కులు నిక్కంబులని నమ్మి, కొంతవఱకు శంకించియు, మానినచో శపించునేమోయని భయపడి నరమాంసమును దయారు చేయించెను. అంత మధ్యాహ్నమగు సరికి నిజమైన వసిష్ఠుఁడు రాగా, ఆ మహామునికిఁ గలసూపు నెఱుంగఁ జాలక యా నరమాంసముతో భోజనమును బెట్టించెను. అప్పుడు వసిష్ఠుఁడు నరమాంసమును గుర్తించి, మండిపడుచుఁ గన్ను లెఱ్ఱజేసి 'ఓ రాజాధమా! మేము తపోనిధులమనియు, బ్రాహ్మణులమనియు, ఆహారమునందు నియమమును గలవారమనియు, అందు కులగురువులమనియు, నెఱింగియు ఈ విధముగా నరమాంసమును బెట్టించితివేల ? ఇది

యేనా నీవు నాకొనర్ప వలసిన సత్కారము? ఇదియేనా నీ రాజధర్మము? ఇదియేనా నీ సత్ప్రవర్తనము? నీచా! ఇంత కండ కావరమా? బ్రహ్మర్షి యని సకల లోకంబులచేత నెన్నఁబడిన నన్నే యవమానింపఁ దలంచితివా? ఇదో దీనికిఁ బ్రతిఫలము నిప్పుడే యనుభవింపుము. నీవు రాక్షసుఁడవై పండ్రెండు వత్సరములు నరమాంసాహారముతో జీవించెదవు గాక' యని శాప మొసంగెను. అప్పుడు మిత్రసఖుఁడు గడ గడ వణకుచు 'మహాత్మా! ఇదియేమి న్యాయము? ఈ విధముగా నొనర్ప వలసినదని మీరేగదా తెలియఁ జేసినది? ఇటు లొనర్పకున్నచో సంతానము గలుగదనియు, మీరు మిక్కిలి శాపమునకు గురియయ్యెదననియు శాసించితిరిగదా? ఇందు నాతప్పేమి గలదు?' అని విన్నవింప వసిష్ఠుఁడును ఆశ్చర్యపడి దివ్యదృష్టివలన జరిగిన దంతయును దెలిసికొని 'రాజా! నిజము. నీవు చెప్పినట్లు నీవలన ఎంత మాత్రమును దప్పులేదు. ఇది యంతయు రాక్షస మాయవలన జరిగినది. అయినను మాశాపము వ్యర్థము కానేరదు. నీవు రాక్షసుండవై పండ్రెండు సంవత్సరము లుండక తీరదు.' అని తెలియఁ జేసెను.

వసిష్ఠుఁడు, తనవలన ఎంతమాత్రమును దప్పులేదని తెలిసికొనియుఁ దన్నట్లు శపించి నందుకు మిత్రసఖుఁడు తీవ్ర

కోపమును వహించి, 'గురూత్తమా! నన్ను నిష్కారణముగా శపించితిరి కావున నిదిగో దాని ఫలమిప్పుడే మీరును అనుభవింపఁ గల'రని ఆతనికిఁ బ్రతిశాప మిచ్చుటకై జలమును పుడిసిటఁ బట్టెను. అప్పుడు అతని భార్యయగు మదయంతీదేవి యీ ఘోర కృత్యమును గాంచి 'నాథా! వలదు. గురునకుఁ బ్రతిశాప మీయవలదు. ఆ మహాత్ముఁ డలిగినచో లోకంబు లన్నియు నశింపఁ గలవు. ఆతపోనిధిని మీరు వారింపఁగలరా? నామాట వినుఁడు. ఇట్లొనర్చుట మీ సచ్చరితంబునకుఁ గళంకమును గూర్చి నట్లగును. ఇందు మన మేమీ సపోతిమి. దూరము విచారింపక చేసిన దానికిఁ బ్రతిఫలమనుభవింపక తీరదు.' అని యనేక విధముల నచ్చఁజెప్పి యాతనిని వారించెను. అప్పుడు మిత్రసఖుఁడు తన భార్యతో 'దేవీ! ఈ జలము మాత్రము వ్యర్థము గానేరదు. ఈ నీరు ఎందుఁ బడిన ప్రమాదము వచ్చును. అన్యాయముగా ఒకరిని హింసించుట ధర్మముగాదు. కావున ఈ జలమును నాపాదములపైఁ జల్లుకొని ఆఫలమును నేనే యనుభవించెదను.' అని పలికి యట్లొనర్చెను. వెంటనే ఆతని పాదములు కమిలి నల్లబడి పోయెను. అందువలన ఆతనికి 'కల్మాషపాదు'డను పేరు ప్రసిద్ధమయ్యెను.

ఈ విధముగా మిత్రసఖుఁడు తన కోపమును వారించుకొని గురుని శాపప్రకారము రాక్షసుఁడై అడవులయందు

విహరింప సాగెను. కంటబడిన వారి నందఱిని జంప సాగెను. ప్రొద్దు పొడిచినది మొదలు, ప్రొద్దుగ్రుంకు వఱకు ఆతనికి హింసయే ముఖ్యమైన పనియై యుండెను. ఇట్లతఁడు విహరించుచు ఒకనాడు ఆ యరణ్యమున ఒక చోట వన విహారము సేయుచున్న ముని దంపతులనుగాంచి, వారిలోఁ బురుషునిఁ బట్టి చంపెను. అప్పు డతని భార్య మిక్కిలిగా విలపించుచు ‹ఓరీ దుర్మార్గుఁడా! అన్యాయముగా నా భర్తను జంపితివిఁ గాన నీవును నీ భార్యను గూడి నపుడు మరణింతువుగాక' యని శాప మొసంగి భర్తతో సహగమన మొనర్చెను. మిత్ర సఖుఁడును వసిష్ఠుని శాపము పరిపూర్తియగుటవలన రాక్షస రూపమును దొలఁగి, యెప్పటి యట్లు సహజ రూపముతోఁ దిరిగి రాజ్య భారమును వహించెను. అదివఱకే పుత్రుఁడు గలిగి యుండుటవలన, ముని పత్ని శాపమును జ్ఞప్తి యందుంచుకొని భార్యను ముట్టుకొనక కాలమును గడుప సాగెను.

నీతి:—బాలకులారా! ఏ కార్యమైనను దూరము విచారించి మఱి చేయవలెను. తనకు శక్తియున్నప్పటికిని మహాత్ముల కెగ్గొనర్ప సమకట్టరాదు. మన మెంత యత్నించినను విధి కృతమును దప్పించుకొనఁ జాలము.

---

# ౬. జడ భరతుని చరిత్ర.

(భాగవత పురాణాంతర్గతము.)

పూర్వము ఋషభుఁ డను ఒక రాజేంద్రుఁడు గలఁడు. ఈయన క్షత్రియుఁడై నప్పటికిని, శ్రీహరి యంశంబున జన్మిం చిన వాఁడగుటవలన మొదటి నుండియు మంచి బ్రహ్మ జ్ఞానియై యుండెను. శ్రీహరియే ఋషభావతార మెత్తెనని అందఱును దలంపఁ జొచ్చిరి. ఋషభుఁడు చిన్న తనము నందే వేద వేదాంగాది సమస్త విద్యలను జదివి యుండెను. వంశ క్రమాగతంబగు రాజ్యంబును వహించునప్పటికిని—కులా చార ప్రకారంబు గృహస్థాశ్రమమును స్వీకరించినప్పటికిని— రాజ్యభోగంబులపై నాసగొనక, సంసార బంధంబులయందుఁ దగుల్కొనక, ఎల్లప్పుడు వైరాగ్యమార్గము నవలంబించి, ప్రజాపరిపాలన మొనర్పసాగెను. వైరాగ్యమార్గము నవలం బించి నప్పటికిని, సంపూర్ణముగా సంసార పరిత్యాగ మొనర్చి యుండలేదు. ఋతుధర్మమును జక్కఁగా గుర్తించి తగిన సమ యములందు మాత్రము భార్యయందు గృహస్థధర్మమును నెఱపుచుండెను. ఇట్లు పెక్కు సంవత్సరములు గతించెను. ఋషభునకుఁ బెక్కుమంది కుమారులు గలిగిరి. పెద్ద కుమా రుని పేరు భరతుఁడు. ఇతఁడు మొదటి నుండియు జడ స్వభా వము గలవాఁడగుటవలన, ఇతనికి జడభరతుఁడను పేరు ప్రసిద్ధ

మయ్యెను. పెద్దకుమారునకు యుక్తవయస్సు వచ్చినంతనే ఋషభుఁడు రాజ్యమును ఆతని యధీన మొనర్చి, తాను భార్యతోఁ గలసి తపోవనంబున కరిగెను.

భరతుఁడు రాజ్యమునకు వచ్చినంతనే, విశ్వరూపుఁడను పేరుగల ఒక రాజుయొక్క కుమార్తెను—పంచజని అను పేరు గలదానిని పెండ్లిచూడెను. భరతుఁడు గూడ ప్రతివిషయము నందును దండ్రియగు ఋషభుని బోలియుండెను. రాజ్యమును వహించినాడని చెప్పుటయే కాని, ఆతనికి రాజ్యభోగంబుల యందెంత మాత్రమును మనస్సులేదు. పెండ్లిచేసికొనెనని తలంచుటయే కాని సంసారసుఖము నందెంత మాత్రమును ఆతనికి బుద్ధిలేదు. ఈవిధముగాఁ గొన్ని సంవత్సరములు మాత్రము రాజ్యపరిపాలన మొనర్చి, పిమ్మట విరక్తిఁజెందిన వాఁడై తన తమ్మునికి రాజ్యము నంటఁగట్టి, గృహమును విడిచిపోయెను.

భరతుఁ డట్లు సన్యాసము నవలంబించి, గండకీ నదీతీరమున, పులహ మహాముని యాశ్రమమునకు సమీపమున, ఒక యాశ్రమమును నిర్మించుకొని, బహునిష్ఠతో శ్రీహరిని గూర్చి తపముసేయ నారంభించెను. ఇట్లు కొంతకాలము గడచెను. ఒకనాఁ డా మహాత్ముఁడు గండకీనది యందు స్నానముచేయుచున్న సమయమున, నిండు చూలు దాల్చి

యున్న ఒక లేడి, ఆనదియందు నీరు ద్రావుచుండెను. అదే సమయమున ఒక సింహము దిక్కులు మారుమ్రోగునట్లు భయంకరముగా గర్జించెను. ఆ యఱపు విని, నీరు ద్రావు చున్న ఆయాడులేడి భయపడినదై, ఒక్క దుముకు దుమికెను. తోడనే గర్భములోని పిండము జారి ఆనీటిలోఁ బడెను. ఆలేడియుఁ గొంత దవ్వరిగి ప్రాణ భయముచేత నొకచోట మృతినొందెను. ఇదంతయును గాంచుచున్న జడభరతునకు, తలవని తలంపుగ దుఃఖ మతిశయించెను. క్షణమునకుఁ గలుగఁ బోవు సంగతియుః దెలియదుగదా యని ఆలేడిని గూర్చియు, ఆ సింహముయొక్క గర్జనమును గూర్చియు, దాని వలన గలిగిన మహోపద్రవమును గూర్చియు నాతఁడు అనేక విధములఁ దలపోయుచు, ఎట్ట యెదుట నీటిపైఁ దేలు చున్న ఆ లేడి పిల్లనుగాంచి మిక్కిలి జాలిపడి, చేరదీసి, తన ఆశ్రమమునకుఁగొనిపోయి నాఁటనుండి అతి ప్రేమతో దానిని బెంప సాగెను. ఆహా! విధి పరిణామమును గుర్తింపఁజాలము గదా? రాజ్య భోగంబులపై నాస గొనక—సంసార సుఖముపై మనస్సు నిల్పక—కేవలము విరాగియై యున్న భరతునకా, ఆలేడి పిల్లపై అంతటి వ్యామోహము గలుగుట! దీని వలన ఏమి జరుగ నున్నదోగదా?

ఈ విధముగా రెండు మూడు సంవత్సరములు గతించెను. లేడి పిల్లయుఁ జక్కగా నభివృద్ధి నొంది పెద్ద దయ్యెను.

కాలము గడచినకొలఁది భరతునకు దానిపైఁ దీరని ప్రేమ గలుగ నారంభించెను. అదియు నా యాశ్రమమునకు సమీపమునఁగల పచ్చిక బయళ్ళయందు మేయుచు గన్నుల పండువుగఁ జెంగు చెంగున దాఁటుచు భరతునకు మనస్సంతోషమును గూర్చుచుండెను. అది ఒక్కగడియ సేపు కన్పడకున్నచో నాతఁడెంతయో దిగులు పడుచుండెను. ఈవిధముగా నానాటికి దానిపైఁ గలప్రేమ భరతుని యందు మిక్కిలి యభివృద్ధి గాఁ జొచ్చెను. రాత్రులయందు దానిని తనప్రక్కన నుంచుకొని నిద్రించుచుండెడివాఁడు. అదియుఁ గడుపునఁ బుట్టిన బిడ్డవలె ఆతనియెడ మిక్కిలి మచ్చికతో వర్తింపసాగెను. ఇట్లు కొంత కాలము గడచు నప్పటికి భరతునకు మరణ కాలము ఆసన్నమయ్యెను. అప్పుడతఁడు ‹అయ్యో! నేను గతించినచో నీలేడి పిల్లకు దిక్కెవ్వరు? ఏమృగము వాతపడుకోకదా! అయ్యయ్యో! దీనినెట్లు విడిచిపోఁ గలను? దీనితో సుఖముగాఁ గాలము గడుపు భాగ్యము నాకింక లభింపదు గదా!' అని అనేక విధముల విచారపడుచు, ఆ లేడి పిల్లనుఁ జేరదీసి తన హృదయమునఁ జేర్చుకొని, కన్నీరుఁ గార్చుచు, మనస్సంతయు దాని యందే నిలిపి ప్రాణములను విడిచెను.

పాపము! భరతునకు జన్మ రాహిత్యము లభించినది కాదు. చని పోవు నప్పుడు లేడిపై బెంగఁగొని యున్న కారణమున, అతఁడు తిరిగి లేడియై జన్మించెను. కాని పూర్వ స్మృతి

మాత్రము ఆతని యందుండెను. అందువలన, అట్లు లేడియై పుట్టిన యనంతరము, ఒక నాఁడతఁడు 'అయ్యో! ఎంతటి దురవస్థకు లోనైతిని? దేవేంద్ర భోగముతో సమానమగు రాజ్యభోగమును విడనాడితిని. సుఖదాయకంబగు సంసారమునుఁ ద్యజించితిని. ఇంద్రియములను జయించితిని. కామ లోభాది గుణములను సమూలముగా నశింపఁ జేసితిని. మనస్థైర్యమును వహించితిని. శ్రీహరినిఁ గూర్చి తపస్సుచేసితిని. ఐననేమి? ఎన్ని యున్ననేమి? ఎంతటివాఁడనైననేమి? మునుల చేత రాజర్షినని అనిపించుకొనిన నేమి? కటకటా! ఒక లేడి పిల్లపై, అంతగా వ్యామోహమును జెంది, తపమును మంటఁ గలిపి, శ్రీహరి స్మరణమును మఱచి, తుదకు అవసాన కాలమునఁగూడ వ్యామోహమునఁ దగుల్కొని ఇప్పు డిట్లు తిరిగి లేడినై పుట్టితినే? అయ్యో! నాకీ జన్మముఁ దొలఁగు టెట్లు? నర జన్మ మబ్బు టెట్లు? జన్మ రాహిత్య మొదవు టెట్లు? ఓ భగవానుఁడా! నాకుఁ ద్రోవఁ జూపుము. నన్నింక గష్టపెట్టకుము. ఇప్పటికి బుద్ధి వచ్చినది. ఇప్పటికేఁ బ్రపంచ స్థితి యెట్టిదో తెలిసినది. నన్ను రక్షింపుము.' అని పలువిధములఁ బ్రార్థింప సాగెను. తన్నుఁ గూర్చి నిందించుకొన సాగెను. లేడియై పుట్టి నప్పటికి ఆతఁడు భగవద్ధ్యానమును మాన లేదు. ఆహార నిద్రాదులను ద్యజించి, యెల్లప్పుడు పరాత్పరుని

యందే మనస్సు నిల్పి జన్మనివృత్తికై ప్రార్థింప సాగెను. ఆతనికి మంచిదశ రానుండెనో యనునట్లు, అచిరకాలముననే మరణ మాసన్నమయ్యెను. అప్పుడు లేడి రూపమును దొలంగి, పుణ్యావశమున ఆంగీరసమునికిఁ బుత్రుఁడై జన్మించెను.

ఈజన్మమునందును భరతుఁడు పూర్వ జ్ఞానమును గలిగి యుండెను. అందువలనఁ జిన్నతనమునందే యెట్టి వ్యామోహము లందును దగుల్కొనక, వైరాగ్యమార్గము నవలంబించి గృహమును విడిచి పోయెను. ఆహారనిద్రాదులను గూడఁ గొంతవఱకు జయించి పిచ్చివాని విధమున అందందుఁ దిరుగ నారంభించెను. అంతటి చిన్నవయస్సునందే భరతునకు ఆత్మవిద్య సంపూర్ణముగా వచ్చియుండెను. ఇట్లతఁడు, ఏకాకిగాఁ దిరుగుచుండ నొకనాఁడు సింధుదేశపురాజగు రహూగణుఁడు అనునతఁడు జ్ఞానమార్గము నెఱుంగ దలంచి కపిలమహాముని యొద్దకు ఆమార్గముననే పల్లకినెక్కి పోవుచుండెను. అట్టియెడ ఆపల్లకిని మోయుచున్న బోయలలో ఒకఁడు అలసిపోయి, తనకు మాఱుగాఁ బల్లకిని మోయవలసినదని భరతుని నియమించెను. భరతుఁడును అట్టి పనికి ఎన్నఁడును అలవాటు పడియుండని వాఁడగుటచే నడకయందు దొట్రుపడ సాగెను. అందువలనఁ బల్లకిలో నున్న రాజునకుఁ గష్టముఁ గలిగెను అప్పుడతఁడుబోయలను 'ఏమిరా' అని గద్దించి పలుక వారును

'ప్రభూ! ఇది మా తప్పుఁగాదు. ఇదంతయుఁ బ్రోత్త్రఁగావచ్చిన ఈ బ్రాహ్మణ కుమారునిది' అని తెలియఁజేయ రహూగణుఁడు వెంటనే పల్లకి దిగి, ఎఱుఁగక చేసిన యపరాధమును క్షమింప వలసినదని భరతునిఁ బ్రార్థించెను. అప్పుడు భరతుఁడు నవ్వుచు 'రాజా! క్షమించుటకుఁగాని శిక్షించుటకుఁగాని మానవుఁడు కర్త గానేరఁడు. అన్నిఁటికిని భగవంతుఁడే మూలకారణుఁడు. తప్పొనర్చుట మానవులకు సహజము. అట్టి తప్పును మన్నించి కాపాడుట భగవంతునకు సహజము. ఈ ప్రపంచము నిజముఁ గాదు. ఈ దేహము స్థిరముఁ గాదు. పుట్టుట యెచ్చోటనున్నదో అచ్చోటనే చచ్చుటయు ఉన్నది. కాని అది కాలచక్రముపై నాధారపడి యున్నది. చమురున్నంతవఱకు, దీపము వెలుఁగుచున్నది. చమురు అయిపోయినంతనే దీపము ఆరిపోవుచున్నది. రాజా! ప్రపంచస్థితియు ఇట్లే యుండునని యెఱుంగుము. పొమ్మ్న.' అని చెప్పి తిరిగి గండకీనదీ తీరమునకే యరిగి అచ్చోటఁ దాను ఇదివఱకు నిర్మించుకొనిన ఆశ్రమమునందే వసించుచు, మనస్థైర్యమును వీడక పెద్దకాలము శ్రీహరినిఁ గూర్చి తపంబొనర్చి, అంతంబున మోక్షంబు నొందెను.

నీతి:—బాలకులారా! దైవవిధినిఁ దప్పించువారెవ్వరునులేరు. ఇదియే యీకథవలన మనము నేర్చుకొనవలసిననీతి.

# ౧౦. నృగమహారాజుచరిత్రము.

(భాగవత పురాణాంతర్గతము)

పూర్వకాలమున ఇక్ష్వాకు వంశమున నృగుఁడను మహీపాలుఁడొకఁడుండెను. ఆయన మొదటి నుండియు మంచి నడవడి గలవాఁడు. తుదకు నవ్వులాటకైనను అబద్ధమాడి నెఱుఁగఁడు. భుజబలమునందును, సాహసము నందును, ధైర్యమునందును, ఎదురులేనివాఁడు. ఆయన రాజ్యమునకు వచ్చినంతనే, సర్వదిక్కులను జయించి సార్వభౌముఁడని పేరుగాంచెను. రాజ్యమంతయు మంచి స్థితియందుండఁ బరిపాలన భారమును విశ్వాసపాత్రులగు మంత్రులపైఁ బెట్టి యతఁడు ధర్మకార్యములందు నిమగ్నుఁడయ్యెను. అనేక సత్రములను గట్టించెను. లెక్కకు మిక్కిలిగ దేవాలయములను గట్టించెను. నీటి వసతి కొఱకు, బావులను, చెఱువులను త్రవ్వించెను. ప్రయాణీకులకు విశ్రాంతి లభించునట్లు, అక్కడక్కడ పూలతోఁటలను నిర్మింపఁజేసెను. బ్రాహ్మణులకు విరివిగా భూదానముల నొసంగెను. అడిగిన వారికి లేదనకుండెను. వేయేల? ఆతని రాజ్యమున వెతకిచూచి నప్పటికి మందునకైనను ఒక్క దరిద్రుఁడు గానరాఁడు; నిరాధారుఁడనువాఁడు మొదలే కానుపింపఁడు.

ఈ విధముగా మర్త్యలోకమును సంతోషింపఁజేసి, దేవ ఋషి పితృలోకంబుల సంతోషింపఁ జేయుటకై పూను కొనెను. అందుకని పెక్కు యజ్ఞముల నొనర్చెను. దేవత లును, నృగమహారాజు యొక్క ధర్మ ప్రవర్తనమునకు మెచ్చి కొని, స్వస్వరూపములతో నరుదెంచి తమ తమ హవిర్భా గంబులఁ గొని పోవుచుండెడివారు. ఋషులు తగిన విధంబుల సత్కరింపఁబడి సంతోషించుచుండెడివారు. నృగుఁ డెల్లప్పుడు గోదాన మొసంగునప్పుడు తొలిచూలుపాడి యావులనే యిచ్చుచుండెడివాఁడు. ఇట్లుండ నొకానొకప్పుడు, కశ్యప మునికి, నృగుఁ డొక పాడి యావును దాన మొసంగెను. కాని కర్మవశమున నాయావు తప్పించుకొని తిరిగి వచ్చి మందలోఁ జేరెను. ఆ యావును, దాన మీయఁబడినదని గుఱుతింపలేక, యా రాజు తిరిగి యింకొకరికి దాన మిచ్చెను. ఆ బ్రాహ్మణుఁ డా యావును దీసికొని పోవుచుండఁ గశ్యపుఁడు, తప్పించుకొని పోయిన తన యావుకై వెదకికొనుచు, నీ బ్రాహ్మణుఁడు తీసి కొని పోవుచుండుటఁ జూచి యాతనిని సమీపించి, 'అయ్యా! ఈ యావునాది. మీరీ విధముగా దొంగిలించి దీనిఁ దీసికొని పోవుటతగునా?' యని యడిగెను. అందు కా బ్రాహ్మణుఁడు రవంత కోపముతో 'స్వామీ! నిజమును గుర్తింపక యీ రీతిగా మాట్లాడుట మీ యట్టివారికిఁ దగదు. ఈ యావును నేను దొంగిలించలేదు. నృగమహారాజుగారు దీనిని నాకు

దాన మిచ్చుటఁజేసి తీసికొని పోవుచుంటిని' అని చెప్పెను.
అప్పుడు కశ్యపుఁడు 'అయ్యా! నా తప్పును మన్నింపుఁడు.
ఈ యావు నా కిదివఱకే దాన మీయఁ బడినది. అందువలన
నది నాది కాని మీది కానేరదు. ఒకసారి దానమీయఁబడి
నది, రెండవమారు దాన మిచ్చుటకుఁ బనికిరాదు. కావున
శాస్త్రీయముగా నీ యావు నాదై యున్నది. రాజుగారి దగ్గ
ఱకే వెళ్ళి మన తగవును దీర్చికొందము రమ్ము.' అని చెప్పి
యా బ్రాహ్మణుని తోడను, ఆ యావుతోడను నృగుని కడ
కరుదెంచెను.

ఈ విధముగా వచ్చిన వారిరువురి వృత్తాంతమును నృగ
మహారాజు తెలిసికొని, తన తప్పిదమునకు నొచ్చుకొని యా
బ్రాహ్మణునితో 'మహాత్మా! నిజమును గురుతింపలేక మీకీ
యావును దాన మిచ్చితిని. ఇది శాస్త్రమునకు విరుద్ధము.
కావున దీనిని కశ్యపున కిచ్చివేయుఁడు. దీనికి బదులుగా ఇట్టి
యావులను మీకు వేన వేలొసంగెదను' అని చెప్పెను. కాని
యా బ్రాహ్మణుఁడు సమ్మతింపక తన కదియే కావలయునని
చెప్పి మారు మాటాడక యా గోవును దోలుకొని తన
యింటి కరిగెను. అప్పుడు నృగుఁడు చేయున దేమియు లేక
కశ్యపునిఁ జూచి 'స్వామీ! నా తప్పును మన్నింపుఁడు. అట్టి
గోవు లెన్ని కావలయునన్న, అన్ని యిచ్చెదను' అని ప్రార్థనా

పూర్వకముగాఁ దెలియఁ జేసెను. కాని కశ్యపుఁడు కినుక వహించినవాఁడై 'ఓరాజా! బ్రాహ్మణ ధనము నపహరించిన నీయట్టి వానిని శిక్షింపక విడువరాదు. ధర్మమును రక్షింప వలసినవాఁడవైన నీవే యధర్మమునకుఁ బాల్పడితివి. కావున నీ వొక పెద్ద యూసరవిల్లివై, యొక కూపంబునఁ జిక్కి తపించె దవుగాక'యని శపించి, శాపవిముక్తియైనను దెలుపక తన యాశ్రమమున కరిగెను. 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం'అను న్యాయానుసారము నృగుఁ డప్పుడే యూసరవిల్లియై పోయెను. ఆహా! ఎంతటి వారికైనను బుద్ధాకృత కర్మానుభవంబు దప్పదుగదా!

అట్లు నృగమహారాజు శాపోపహతుండై యుండ నొక్కనాఁడు శ్రీకృష్ణ పరమాత్ముని పుత్రులగు మన్మథుఁడు, సాంబుఁడు మొదలగువారు మృగయా వినోదార్థ మరిగి తిరిగి వచ్చుచు మార్గమధ్యంబునఁ గూపంబునఁ జిక్కి తపించు చున్న యూసరవిల్లిని గాంచి లేవదీయు వారలై యత్నింప నయ్యది కదలదయ్యెను. వారును దాని సత్వంబున కాశ్చర్య పడుచు గృహంబున కరిగి శ్రీకృష్ణ భగవానున కా సమా చారంబునంతయుఁ దెలుప నాతండును విస్మయంబంది కుమా రులతో నా కూపంబు కడ కరుదెంచి యా యూసరవిల్లిని దన వామ హస్తంబున నందుండి వెడలఁ దిగిచెను. శ్రీకృష్ణుని

కరస్పర్శనంబు వలన నృగుఁడు శాపవిముక్తి నొంది యెప్పటి రూపంబును దాల్చెను. కృష్ణుండు సర్వజ్ఞుఁడయ్యు నేమియు నెఱుంగని వానివలె నృగునిఁ గాంచి 'నీ వెవ్వఁడవు?' అని యడిగెను. అంత నృగుఁడు చేతులు గట్టుకొని 'స్వామీ! సర్వంబు నెఱింగియు నేమియు నెఱుంగని వాని చందంబున నిట్లడిగెదరేల? జగత్కారణ భూతుండవగు నీకుఁ దెలియని విషయం బేమికలదు? మహాత్మా! నీవు సర్వవ్యాపివి. సర్వ రక్షకుఁడవు. సృష్టి స్థితి సంహారక క్రియలు నీవలన జరుగు చున్నవి. అయినను అజ్ఞునివలె నన్నడిగితివిగాన నాచరిత్రంబు నెఱింగింతు'నని పలికి యామూలాగ్రముగాఁ దన చరిత్ర మును శ్రీకృష్ణునకుఁ దెలియఁ జేసెను. కృష్ణుండును, అతని చరిత్రమును సాంతముగావిని 'ఓయీ! దీనికై నీ వెంత మాత్రమును జింతింప వలదు. నీ విప్పుడు పవిత్రుఁడవైతివి. నేఁడు మొదలు శాశ్వత పుణ్యలోక సుఖంబుల ననుభవించె దవుగాక!' యని చెప్పునంతలో దేవ విమాన మొండు వచ్చి నృగుని స్వర్గలోకమునకుఁ గొని పోయెను. కృష్ణుండును కుమారులతో గృహంబున కరిగెను.

నీతి:—బాలకులారా! విప్రుల ధనము విషమువంటిది. పొరపాటుననైనను వారల సొమ్మును అపహరింపరాదు. ఇదియే యీ కథ వలన మీరు నేర్చుకొనవలసిన నీతి—

సంపూర్ణము.

ఓమ్.

# పురాణచంద్రిక.

## రెండవ భాగము.

కవికుమార,

మహావాది వేంకటరత్న విరచితము.



**Sold By**

RAMA & Co., BRANCH:

TENALI.

1930

కమలా ప్రెస్, తెనాలి.



**Price As. 6.**

# విషయసూచిక




౧. పరశురామోపాఖ్యానము. — పుట ౧

(శివపురాణాంతర్గతము)

౨. మాధవవర్మోపాఖ్యానము. — ౧౮

(పద్మపురాణాంతర్గతము)

౩. అనిరుద్ధోపాఖ్యానము. — ౩౩

(బ్రహ్మవైవర్తపురాణాంతర్గతము)

౪. అజామిళోపాఖ్యానము. — ౪౪

(భాగవతపురాణాంతర్గతము)

౫. చిత్రకేతోపాఖ్యానము. — ౫౩

౬. కుచేలోపాఖ్యానము. — ౬౭

౭. నరజన్మము. — ౭౮

(అష్టాదశపురాణాంతర్గతము)

ఓమ్.

# పురాణచంద్రిక

రెండవ భాగము.

## ౧. పరశురామోపాఖ్యానము.



(శివపురాణాంతర్గతము.)

పూర్వము చంద్రవంశపువాఁడైన గాధి యను నొక రాజోత్తముఁడు గలఁడు. అతఁడు సమస్త ధర్మముల నెఱింగినవాఁడు. సకల సద్గుణములు గలవాఁడు. మను ధర్మమును దప్పక యా గాధిరాజు రాజ్యపరిపాలన మొనర్చుచుండెను. ఒకనాఁడా నృపాలుని కడకు ఋచికుండను నొక ఋషీశ్వరుఁడరుదెంచి, దగిన విధమున నాతనిచే సత్కరింపఁ బడిన యనంతర మాతనిఁ జూచి 'రాజా! నేను గృహస్థాశ్రమమును గైకొనఁ దలంచి యుంటిని. కాని నాకుఁ దగిన కన్యకామణి యెచ్చటను లభింపలేదు. నీపుత్త్రిక సకల సద్గుణ సంభరిత యనియు, సుశీలయనియుఁ దెలిసికొని, నీ చెంత కరుదెంచితిని. కావున నీ కొమార్తెను నాకిచ్చి పెండ్లి సేయు' మని

యడిగెను. గాధిరాజున కిది మనస్తాపమునకుఁ గారణ
మయ్యెను. నవయౌవనవతియు, నద్వితీయ సౌందర్యవతియు,
రాకుమారియు, నగు తన తనయను నొక జడదారికిచ్చుట
కాతని హృదయ మొప్పినదికాదు. కాని యియ్యనని చెప్పినఁ
దపశ్శాలియగు నాతఁ డలిగి శపించునేమో? ఏమియుఁ బాలు
వోవక యెట్లైనను, మిష పెట్టి యా ఋషీశ్వరునిఁ బంపుద
మని నిశ్చయించుకొని యా నృపాలుఁడు ఋచికునిఁ జూచి
'అయ్యా! మీయట్టి మహానుభావులకుఁ గన్యనిచ్చుట యను
నది పూర్వపుణ్య పరిపాకంబువలన లభించునుగాని యూరకే
లభింపనేరదు. అయినను నా దొక విన్నపంబుగలదు. నల్లని
చెవులును, తెల్లని దేహకాంతియును గల వేయిగుఱ్ఱముల
నెవ్వఁడొసంగునో యట్టి వానికి నా తనయ నిచ్చుటకుఁ దల
పోసియుంటిని. పెద్దలు మీకుఁ దెలియనిదేమున్నది? నా
తలంపునకు భంగము గలుగకుండునట్లు మీరొనర్తురేని నా
పుత్త్రికను మీ కియ్యఁగల' నని తెలుప, వల్లెయని యాతఁ
డరిగి నిజ తపోబలంబువలన వరుణుని మెప్పించి, గాధిరాజడి
గిన వేయి గుఱ్ఱముల నాతని వలనఁ బడసెను. ఋషికుఁడు
గుఱ్ఱములఁ గొని వచ్చినంత గాధిరాజు మాఱుమాటాడక,
సత్యవతియను పేర నొప్పు తన పుత్త్రికను నాతని కొసంగి
పెండ్లి గావించెను. గాధిరాజునకుఁ బుత్త్రికా సంతానము

దప్ప, పుత్త్రి సంతానము లేదయ్యెను. ఋచికుఁడు తపః ప్రభావసంపన్నుఁడని యెఱింగి, యాతని యత్తగారును, భార్య యును, బుత్త్రిసంతానంబు గలుగు విధంబు నారయ వలసిన దని ప్రార్థింప, నతండును దన తపోమహిమంబువలన బ్రహ్మ మంత్రములతో నొక పాయసంబును, క్షత్రియ మంత్రములతో నొక పాయసంబును, దయారుచేసి స్నానార్థమై నదికరిగెను. ఆతఁడు తిరిగి వచ్చులోపల బ్రహ్మమంత్ర ప్రయుక్తంబగు పాయసంబును, నాతని యత్తగారును, క్షత్రియ మంత్ర ప్రయుక్తంబగు పాయసంబును నాతని భార్యయును గ్రోలిరి. అందువలన సత్యవతికి జమదగ్నియు, నామె తల్లికి విశ్వామిత్రుఁడును బుట్టిరి. బ్రహ్మమంత్ర ప్రభావంబు వలనఁ బుట్టిన వాఁడగుట వలన విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యయ్యెను. క్షత్రియ ప్రభావంబు వలనఁ బుట్టిన వాఁడగుట వలన జమదగ్ని, క్షాత్ర తేజంబుగలవాఁడయ్యెను. జమదగ్ని యుక్త కాలంబున రేణుకయను కన్యను బరిణయమాడెను. ఆమెకు నల్వురు కుమారులు గలిగిరి. వారిలోఁ గడ గొట్టువాఁడు పరశురాముఁడు. ఇతఁడచ్చముగు క్షత్రియ పౌరుషంబు గలవాఁడు.

పరశురాముఁడు శ్రీమహావిష్ణువుయొక్క యవతార మని కొందఱుచెప్పుదురు. ఇతనికి ముఖ్యమైన యాయుధము

కుమారము. ఇతఁడు దివ్యమైన పితృభక్తిగలవాఁడు. మహాతపో నిధి. ఒకనాఁ డితని తల్లియగు రేణుక, జలమును గొని వచ్చు టకై గంగానదికరిగి, యచ్చోట సతులతో జలక్రీడసలుపు చున్న చిత్రరథుఁడను గంధర్వునిఁ జూచి, మనంబుచలించి నదై, కొంత తడవు నిలిచెను. అందువలనఁ గొంతయాలస్య మయ్యెను. ఆమె జలమునుగొని యాశ్రమమున కరుదెంచి నంతనే, జమదగ్ని తనదివ్యదృష్టివలన నామెయాలస్యమునకుఁ గారణమును దెలిసికొని, కినుకవహించినవాఁడై, కుమారులను జూచి, యామెను సంహారింపవలసినదని యాజ్ఞాపించెను. కాని మొదటి ముగ్వురు కుమారు లాతని యాజ్ఞను శిరసావ హింపరైరి. అప్పుడు పరశురాముఁడు పితృభక్తిగలవాఁ డగుట వలనఁ దండ్రి యాజ్ఞానుసారము తన తల్లిని వధించి, తా నేహస్తముతోఁ దన తల్లిని నఱికెనో, యట్టి తన హస్త మును గూడ నఱికికొని, తండ్రి చెంత కరిగెను. జమదగ్నియుఁ దన యెడల నాతని కున్న భక్తి కెంతయు సంతసించి, యేమి వలయునో కోరుకొన వలసినదని తెలుప నాతండును దన తల్లిని బ్రదికింప వలసినదని కోరెను. ఆతఁడును రేణుకను బ్రది కించి, కుమారునకుఁ దిరిగి హస్తమువచ్చున ట్లనుగ్రహించెను. అనంతరము కొంత కాలంబునకుఁ బరశురాముఁడు తండ్రి వలన ననుజ్ఞఁబొంది తపంబున కరిగెను. బాలకులారా! పరశు

రాముఁడు తండ్రి యాజ్ఞా ప్రకారము తల్లిని వధించినాఁడని మనము గూడ నట్లు సేయఁగూడదు. తిరిగి బ్రతికించు సమర్థత యున్నచో మన మట్లు సేయవచ్చును.

ఒక నాఁడష్టాదశ ద్వీపములకుఁ జక్రవర్తియైన కార్తవీర్యార్జునుఁడను నతఁడు మృగయావ్యాపారంబునఁ దగిలియరణ్యంబులఁ గ్రుమ్మరుచు మధ్యాహ్న మగునప్పటికి జమదగ్ని యాశ్రమమును జేరెను. అప్పుడు జమదగ్ని యతిథిసత్కారమొనర్పఁదలఁచి యాతనిఁ జేరంజని 'రాజా! భోజనమునకు వేళ యతిక్రమించినది. ఆలస్యమెందుకు? భోజనము గొందువు లెమ్మ'ని పలుకఁ గార్తవీర్యుఁడు 'ఋషీశ్వరా! నేనొక్కఁడనుగాను. అనేక వేలమంది సైనికులు నావెంటఁ గలరు. వారందఱికిని మీరు విందొనర్పఁజాలరు. వారిని విడిచి నేను భుజించుటయు సమంజసముగా'దని విన్నవింప జమదగ్ని 'రాజా! ఆవిచారము నీకు వలదు. నీకును నీవారికిని విందొనర్పఁ గలను. లెమ్ము. వేళ యతిక్రమించుచున్న'దని నుడివి తన కామధేనువును బిలిచి, రాజునకును సైనికులకును, షడ్రసోపేతంబుగ నాహారంబును గూర్పవలసినదని తెలుప నాసురభియు నిజ ప్రభావంబువలన సర్వంబును దృటికాలమున సమకూర్చెను. కార్తవీర్యుఁడు తన పరివారముతో విందారగించెను. భోజనానంతరము సురభి యొక్క ప్రభావమునకు

మిక్కిలి వింతపడుచు, నట్టియావు తనకుండుట మేలని తలంచినవాఁడై, జమదగ్నిని జేరంజని (మహాత్మా! ఏకాంగులగు మీకీ సురభితో నిమిత్తమేమి గలదు? నేను జక్రవర్తిని. అనేకవేల సైనికులు నాకుఁ గలరు. ఇట్టి యావత్సమయంబులందు వారల కాహారమును గూర్చుట నాకు మిక్కిలి కష్టముగా నున్నది. కావున మీసురభిని నాకొసంగుఁడు. అది నాకెంతయు బ్రయోజనకారి యగును.' అని నుడివెను.

జమ—రాజా! ఇదియేమి? రాజు లిచ్చువారలేగాని పుచ్చుకొనువారు గారుగదా? పుచ్చుకొనుట బ్రాహ్మణ ధర్మముగాని రాజ ధర్మము గాదుగదా?

కా ర్త—మునీంద్రా! ఏమట్లు సెలవిచ్చెదరు? ఉత్తమ పదార్థమును గొనుట మూర్ధాభిషిక్తులకు సదాచారమై యున్నది గదా?

జమ—అట్లని యెందు చెప్పఁబడియున్నది?

కా ర్త—ఎందని యడుగనేల? ఇది మొదటినుండియు వచ్చుచున్న యాచారమే. ఇందుకు శాస్త్ర ప్రమాణం బనవసరంబు. ఓమునీశ్వరా! మీరెయ్యకున్నను, బలాత్కారముననైన నేనీసురభిని గొనిపోయెదను. నాబాహుబల పరాక్రమంబులు మీ రెఱుంగనివి గావు.

జమ—ఓహో! అట్లనా? బ్రాహ్మణులు శాపాయుధులని యెఱుంగవు గాబోలు? బ్రహ్మ తేజంబుమోఁల నితరంబు లన్నియు నిష్ప్రయోజనంబులని యెఱుంగవు గాబోలు. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అను కరణి నీకు వినాశకాలము డగ్గరించుట వలననే, నీకీ దుర్బుద్ధి వొడమినది. మాటలేల? చేతనగుచో సురభినిఁ గొనిపొమ్ము.

జమదగ్ని మాటలకుఁ గార్తవీర్యుఁడు కనలినవాఁడై, సైన్యంబులఁ బురికొల్పుకొని, యా మునిసత్తముని నెదిరించెను. అప్పుడతఁడు కామధేనువు సహాయంబున సైనికుల సృజించి కార్తవీర్యు నెదుర్కొనెను. అంత నుభయ పక్షముల వారికిని బోరు ఘోరమయ్యెను. కార్తవీర్యుఁడు జమదగ్ని నెదిరించి పెక్కుగతుల యుద్ధ మొనర్ప సాగెను. అమ్మౌని నాతని ననేకవిధంబుల నొప్పింపఁ దొడంగెను. కార్తవీర్యుఁడు సామాన్యుఁడుగాఁడు. అతనికి వేయి చేతులు గలవు. లక్షల కొలఁది సైన్యములు గలవు. అంతియగాక యాతఁ డంబికకుఁ బ్రియమైన భక్తుఁడు. అందువలన నాతనికి దేవి సహాయము పూర్తిగాఁ గలదు. మఱియు నాతని కనేక దివ్యాస్త్రములు గలవు. ఇన్ని కారణంబులవలన నాతఁడు తపోనిధియగు జమదగ్నిని లక్ష్యపెట్టక పోరఁ దొడంగెను. కాని

జమదగ్ని వలన నాతఁడు ముమ్మారోడి పోయెను. ఓడి పోయి నను నాతఁడు యుద్ధమును మానలేదు. ఈ విధముగా నిరువది యొక్క రోజు పోరు ఘోరముగా జరిగెను. ఆనాఁడు కార్త వీర్యునకు దేవి ప్రత్యక్షమై యొక శక్తి బాణము ననుగ్రహించెను. ఆ బాణమును గన్నుల కద్దికొని, దేవిని స్మరించుచు, వింట సంధించిన వాఁడై, జమదగ్ని మీఁదఁ బ్రయోగించెను. అయ్యది యమోఘమగుట వలన దానిచేత జమదగ్ని విగత జీవుఁడయ్యెను. కార్తవీర్యుఁ డంతట నిలువక యాతని మొదటి మువ్వురు కుమారులను గూడఁ బట్టి చంపెను. ఇట్లు జయలక్ష్మిఁ గైకొని, సురభిని బలాత్కారముగాఁ గొని పోయెను. కాని యా సురభి తన ప్రభావముచేత నింద్రలోకమున కరిగెను. పాపము! ఎద్దాని కొఱకింతగా నాతఁడు యుద్ధమొనర్చి, బ్రహ్మహత్యా మహాపాతకమునకు గూడ లోనయ్యెనో, యట్టి సురభి యాతనికి లభింపక పోయెను.

భర్తృ మరణమును, గుమారుల మరణమును, దెలిసి కొని రేణుకాదేవి మిక్కిలి విలపించుచుఁ బతిలేని జీవన మెందుకని సహగమన మొనర్ప నిశ్చయించుకొనెను. కాని యామెకుఁ బగ సాధింప వలయు ననెడి కోరిక మిక్కుటముగా నుండెను. క్షత్రియుల కింత కండకావరమా? యని యామె కినుక వహించెను. అందువలన నేమి ప్రయోజనము

గలదు? అబలయగు నామె శాస్త్రవిద్య నెఱుఁగోనఁ గలదా? తన చిన్నకుమారుఁడగు పరశురాముఁడే యీ పనిని నిర్వహించువాఁడని యామె ధైర్యము నవలంబించి, యాతని రాకకై వేచియుండెను. బ్రహ్మస్వము నపహరించిన వారికిని బ్రహ్మహత్య గావించిన వారికినిఁ దగినదండనము లభించి తీరును. ఆ పాపఫలమును నట్టి వారు వెంటనే యనుభవించి తీరవలయును. ఇట్టి దుర్జాతి నశించినఁ గాని భూభారము దగ్గదు. అట్టి వినాశమునకుఁ గాలము సమీపించినది.

ఇట్టి సమయమునఁ బుష్కర తీర్థమునఁ దపము సేయు చుండిన పరశురామునకుఁ గనుల వెంట నకారణముగా నీరు గారుటయు నెడమభుజ మదరుటయు సంభవము లయ్యెను. అప్పుడీతఁ డీయశుభ సూచకములవలనఁ దల్లిదండ్రులకు నన్నలకు నేమి కీడు కలిగెనో యని శంకించి యాక్షణముననే బయలుదేరి తండ్రియాశ్రమమున కరుదెంచెను. ఆతఁ డరు దెంచు నప్పటికి రేణుక పెద్ద పెట్టున విలపించుచుండెను. పరశురాముఁడు రోదన కారణమేమని తల్లి నడుగ నామె సర్వమును దెలియఁజేసెను. అంత నతఁడు గోపపరవశుఁడై పండ్లు పటపటఁ గొఱుకుచుఁ ఓ ఇంద్రాది దేవతలారా! ఓ భూమ్యాకాశములారా! ఓ పంచభూతములారా! ఓ త్రిమూర్తులారా! వినుఁడు. వినుఁడు. నాతండ్రిని నాయన్నలను సంహరించిన

నా క్షత్రియున్ని సంహరించి యాతనిర క్తమున నాతండ్రికిఁ దర్పణ మీయవలెనని. ఇంతియగాదు. ఏవంశము నాతండ్రిఁ బ్రాణ ములఁగొనెనో, యట్టి క్షత్రియవంశమును సమూలముగా నశింపఁ జేసెదను. ఇట్లొనర్ప కున్నఁ బితృద్రోహులు పోవు గతికిఁ బోవువాఁడ' నని ఘోరముగాఁ బ్రతిజ్ఞ జేసెను. అత నికిఁ బ్రతిజ్ఞకు లోకము లన్నియుఁ దల్లడిల్లెను. కుమారుని ప్రతిజ్ఞను విని రేణుక మనస్తాపమును వీడినదై, భర్తతో సహగమన మొనర్చెను. రేణుకాజమదగ్నుల చితి ప్రజ్వరిల్లుట చూచినంతనే, పరశురాముని క్రోధాగ్నియు బ్రజ్వరిల్లెను. చితియందుఁ బ్రజ్వరిల్లిన యగ్ని యా మునిదంపతులను సమూలముగా దహించెను. పరశురాముని యందుఁ బ్రజ్వ రిల్లిన క్రోధాగ్ని యింక క్షత్రియవంశమును సమూలముగా దహింప నుండెను. పరశురాముఁడు తల్లిదండ్రులకును, నన్న లకును, నుత్తరక్రియలఁ గావించెను. ఆహా! ఇతని వలన క్షత్రియ వంశమునకుఁ గూడ నుత్తరక్రియలు జరుగనున్నవి కాబోలు?

పరశురాముఁడు తన వారి కంత్యక్రియల నెఱవేర్చిన యనంతరము, ముందొనర్పవలసిన యమానుష కృత్యంబు పొకుఁ దగిన సహాయమును బొందుటకై, తొలుఁ దొల్త కైలా సంబున కరిగి, పార్వతీపరమేశ్వరులకు వందనం బొనర్చి, తన

ప్రతిజ్ఞను మహాదేవునకుఁ దెలియఁ జేసినవాఁడై, యేత
త్కార్యనిర్వాహణమునకుఁ గాను పాశుపతాస్త్రము నొసంగ
వలసినదని ప్రార్థించెను. అప్పుడు పార్వతి తనభర్తనుఁ
జూచి, «మనోవల్లభా! ఈతనికి మీరెంతమాత్రమును పాశు
పతంబు నొసంగవలదు. కార్తవీర్యార్జునుఁడు నాకుఁగూర్చిన
ప్రియభక్తుఁడు. అట్టి నాభక్తుని చావునకు నేనెంతమాత్ర
మంగీకరింప' నని పలుక పరశురాముఁడు దేవిఁజూచి «తల్లీ!
ఇట్లువలుక నీకుఁదగునా? కన్నకుమారుఁడైనను దుర్మార్గుఁ
డగుచో, నట్టివానిని దండింపవలసినదని గదా ధర్మములు
పలుకుచున్నది? అట్టియెడ బ్రాహ్మణాపకారుఁడగు నీభక్తుఁడు
దండ్యుఁడుగాఁడా? ఈ మహాదేవుని భక్తులెందఱెందఱో
దుర్మార్గులగుటవలన విష్ణుమూర్తిచేత సంహరింపఁబడలేదా?
అట్టి తన భక్తుల చావునకీ మహాత్ముఁ డంగీకరింపకుండెనా?
అదిగాక బ్రహ్మహత్యాదు లన్నివిధముల శిక్షార్హములుగదా?
నీ మనోహరునకే యట్టి పాపము కట్టికుడిపినప్పుడితరుల
మాట వేఱె చెప్పవలయునా? భక్తుఁడైనంత మాత్రమున దుర్మా
ర్గుఁడు దండనీయుఁడు గాకుండునా? అందు లోకైకపూజ్యు
లగు బ్రాహ్మణుల కపకారము గావించిన వారియెడలనా
నీవిట్లు కృపవహించునది? తల్లీ! నేనుమాత్రము నీభక్తుఁడను
గానా? నన్నుమాత్రము నీవు రక్షింపవలదా? ప్రతిజ్ఞాభంగము
వలన నేను దుర్గతులను బొందుట యే నీకు సమ్మతమా? జగజ్జ

క్షత్రియుల సంహరించి యాతనిరక్తమున నాతండ్రికిఁ దర్పణ మొసంగెదను. ఇంతియగాదు. ఏవంశము నాతండ్రిఁ బ్రాణములఁ గొనెనో, యట్టి క్షత్రియవంశమును సమూలముగా నశింపఁ జేసెదను. ఇట్లొనర్ప కున్నఁ బితృద్రోహులు వోవు గతికిఁ బోవువాఁడ' నని ఘోరముగాఁ బ్రతిజ్ఞ జేసెను. అతనికిఁ బ్రతిజ్ఞకు లోకము లన్నియుఁ దల్లడిల్లెను. కుమారుని ప్రతిజ్ఞను విని రేణుక మనస్తాపమును వీడినదై, భర్తతో సహగమన మొనర్చెను. రేణుకాజమదగ్నుల చితి ప్రజ్వరిల్లుట చూచినంతనే, పరశురాముని క్రోధాగ్నియు బ్రజ్వరిల్లెను. చితియందుఁ బ్రజ్వరిల్లిన యగ్ని యా మునిదంపతులను సమూలముగా దహించెను. పరశురాముని యందుఁ బ్రజ్వరిల్లిన క్రోధాగ్ని యింక క్షత్రియవంశమును సమూలముగా దహింప నుండెను. పరశురాముఁడు తల్లిదండ్రులకును, నన్నలకును, నుత్తరక్రియలఁ గావించెను. ఆహా! ఇతని వలన క్షత్రియ వంశమునకుఁ గూడ నుత్తరక్రియలు జరుగనున్నవి కాబోలు!

పరశురాముఁడు తన వారి కంత్యక్రియల నొనర్చిన యనంతరము, ముందొనర్పవలసిన యమానుష కృత్యంబునకుఁ దగిన సహాయమును బొందుటకై, తొలుఁ దొల్త కైలాసంబున కరిగి, పార్వతీపరమేశ్వరులకు వందనంబొనర్చి, తన

ప్రతిజ్ఞను మహాదేవునకుఁ దెలియఁ జేసినవాఁడై, యేత
త్కార్యనిర్వహణమునకుఁ గాను భార్గవశస్త్రము నొసంగ
వలసినదని ప్రార్థించెను. అప్పుడు పార్వతి తననాథునిఁ
జూచి, 'మనోవల్లభా! ఈతనికి మీ రెంతమాత్రమును భార్గవ
శస్త్రంబు నొసంగవలదు. కార్తవీర్యార్జునుఁడు నాకుఁగూర్చిన
ప్రియభక్తుఁడు. అట్టి నాభక్తుని చావునకు నేనెంతమాత్ర
మంగీకరింప' నని పలుక పరశురాముఁడు దేవిఁ జూచి 'తల్లీ!
ఇట్లువలుక నీకుఁదగునా? కన్నకుమారుఁడైనను దుర్మార్గుఁ
డగుచో, నట్టివానిని దండింపవలసినదని గదా ధర్మములు
వలుకుచున్నది? అట్టియెడ బ్రాహ్మణాపకారుఁడగు నీభక్తుఁడు
దండ్యుఁడుగాఁడా? ఈ మహాదేవుని భక్తులెందఱెందఱో
దుర్మార్గులగుటవలన విష్ణుమూర్తిచేత సంహరింపఁబడలేదా?
అట్టి తన భక్తుల చావున కీ మహాత్ముఁ డంగీకరింపకుండెనా?
అదిగాక బ్రహ్మహత్యాపాపము లన్నివిధముల శిక్షార్హములుగావా?
నీ మనోహరునకే యట్టి పాపము కట్టికుడిపినప్పుడితరుల
మాట వేఱచెప్పవలయునా? భక్తుఁడైనంత మాత్రమున దుర్మా
ర్గుఁడు దండనీయుఁడు గాకుండునా? అందు లోకైకపూజ్యు
లగు బ్రాహ్మణుల కపకారము గావించిన వారియెడలనా
నీవిట్లు కృపవహించునది? తల్లీ! నేనుమాత్రము నీభక్తుఁడను
గానా? నన్నుమాత్రము నీవు రక్షింపవలదా? ప్రతిజ్ఞాభంగము
వలన నేను దుర్గతులను బొందుటయే నీకు సమ్మతమా? జగజ్జ

వసీ! నేను నీదాసుఁడను. నన్ను 'రక్షింపు' మని యాదేవి పాదములపైఁబడ నామెయు నాతనియెడలఁ గృపవహించెను. అంత శివుఁడుగూడఁ బరశురాముని యందు దయఁగలవాఁడై పాశుపతంబు నొసంగి 'కృతప్రతిజ్ఞుఁడ వగుదువుగాక!' యని దీవించి పంపెను.

పరశురాముఁడు కైలాసంబును వీడి, వైకుంఠమున కరిగి శ్రీమహావిష్ణువును సందర్శించి యనేకవిధములఁ బ్రార్థించెను. ఆదేవదేవుఁడు సంతోషించి, వచ్చినపని యెట్టిదని యాతనిఁ బ్రశ్నింపఁ బరశురాముఁడు తన ప్రతిజ్ఞను దెలిపి 'మహాత్మా! ప్రతిజ్ఞా పాలనంబునకై తగిన సహాయమును బొంద నిట్లరుదెంచితిని. నాయందుఁ బుత్త్రవాత్సల్యముంచి వైష్ణవశక్తిని మంత్రపూరితముగా నొసంగుఁ' డని విన్నవింప, నారాయణుండును 'కుమారా! నీవు నాయంశంబున జనియించితివి. నిన్నెవ్వరును గెలువఁజాలరు. మదోద్రేకంబునఁ గన్ను మిన్నుఁగానక దుర్మార్గులై విఱ్ఱవీగుచున్న క్షత్రియుల సమూలముగా నశింపఁజేసి భూభారమును దగ్గింపుము. పొమ్ము. కృతప్రతిజ్ఞుండవగుము. మఱియు నొక్కటిఁ దెల్పెదవినుము. కార్తవీర్యుని శరీరమున నొకకవచ ముండుగలదు. అది యాతని మేన నిలిచియున్నంతవఱ కాతని నెవ్వరును జయింపఁజాలరు. కావున బ్రహ్మదేవుని కడకరిగి యాకవచము నెట్లైనను

హరింప వలసినదని యాతనిఁ బ్రార్థింపుము. ఆతఁడును నీకెందు సాయపడఁగలఁడు. ఇదిగో! వైష్ణవశక్తితోఁ బాటు నారాయణాస్త్రమును గూడఁ గైకొను' మని యాదివ్యాస్త్రంబుల నొసంగి యాశీర్వదించెను.

పరశురాముఁ డటనుండి సత్యలోకంబున కరిగి బ్రహ్మదేవునిఁ బ్రార్థింప నాతండును గరుణవహించి, కవచము నపహరించుట కంగీకరించుటయేగాక, యాతనికిఁ దనయస్త్రంబునుగూడఁ బ్రయోగోపసంహారంబులఁ దెలియఁజేసి యొసఁగెను. పరశురాముఁడును, నివ్విధంబున దివ్యాస్త్రంబులఁ బడసి, ప్రతిజ్ఞాపరిపాలనంబున కెంతమాత్రమును భంగము రాదని ధైర్యమును వహించినవాఁడై, గండ్రగొడ్డలిని ధరించి యటనుండి బయలుదేరి, కార్తవీర్యుని పురంబున కరుదెంచి, యాతనిని యుద్ధమున కాహ్వానించెను.

అప్పుడు కార్తవీర్యుఁడు పరశురాముని నొక యల్పునిగాఁ దలఁపోసి, సైన్యములఁ గూర్చుకొని యుద్ధమున కరుదెంచెను. క్షత్రియవంశ నిర్మూలనమున కవతరించియున్న పరశురామునిఁ జూచినంతనే కార్తవీర్యుండును నాతని సైన్యములును మిక్కిలి భయమందెను. అయినను బిలువఁబడిన యుద్ధ మొనర్పకుండుట, పౌరుషధర్మము గాదని

రొంచి యాతఁడు నిజసైన్యములతోఁ బరశురాముని మార్కొనెను. ఆతఁడును దివ్యాస్త్రంబుల నెంత మాత్రమును ముట్టక తన గండ్రగొడ్డలితోఁ జేజిక్కినవారల నెల్ల నిలువున దెగనఱకుచుండెను. క్షత్రియుఁడు కంటఁబడుటయే తడవుగ నాతనినిబట్టి నిలువున వధింపఁ దొడంగెను. అతని రౌద్రాకారమును జూచి సైనికులు భయపడి పరుగెత్త సాగిరి. పరుగెత్తువారిని వెంబడించి పరశురాముఁడు చంపుచుండెను. ఎచ్చటఁజూచినను నెత్తుటి కాల్వలు ప్రవహింపఁ దొడంగెను. రణరంగము మిగుల భయానక మయ్యెను. కార్తవీర్యుఁ డెన్ని బాణములు వేసినను, బరశురామున కావంతయు, నొప్పి గలుగుట లేదు. ఆతఁడాబాణములను, మధ్య భాగముననే తుత్తునియలు గావించుచుండెను. ఈ విధముగా రోజుల కొలంది పోరు జరుగుచుండెను. నాడు నాఁటికిఁ దీవ్రమగుచుండెను. లక్షల కొలఁది నున్న సైనికులొక్కనితోఁ బోరఁజాలకుండిరి. దినములు గడచిన కొలంది 'ఇదంక్షాత్ర మిదంబ్రాహ్మ'మను వాక్యమును బరశురాముఁడు సార్థ పరుపసాగెను. ఒకనాఁడు కార్తవీర్యుఁడు హతాశుఁడై, దేవినిఁ బ్రార్థింప నామెయు భద్రకాళీరూపంబున నాతని చెంత నిలిచి, పరశురాముఁడు ప్రయోగించు బాణముల నన్నింటిని, దన భక్తునకుఁ దగులకుండ, నందికొన సాగెను.

అదిగని కార్తవీర్యుఁడు జమదగ్నిసుతుని బాణములచేత మిక్కిలి నొప్పింప సాగెను. తన బాణములు వమ్మగుటకును, నతని బాణములు దన్ను నొప్పించుటకును, సహింపజాలక, కినుక వహించి, సమంత్రకంబుగ వైష్ణవశక్తినిఁ బ్రయోగించెను. ఎదురులేనిదగు నాశక్తి బాణంబునకు భద్రకాళి గూడ భయంపడి రణరంగము నుండి తొలఁగి పోయెను. ఆ బాణము వలనఁ గార్తవీర్యుని సహస్ర బాహువు లొక్క మారుగ ఖండింపఁబడెను. ఆ నాటి రాత్రి బ్రహ్మ, బ్రాహ్మణవేషంబున నాతని చెంత కరుదెంచి, విష్ణుకవచంబు నపహరించుకొని పోయెను. మఱునాఁడు కార్తవీర్యుఁడు యుద్ధమునకు బయలుదేరగనే యెన్నియో యపశకునములయ్యెను. తనకు మరణకాలము సంప్రాప్తమయ్యెనని యాతఁడు గ్రహించెను. బ్రహ్మహత్యామహాపాతకమునకు మరణదండనమే యోగ్యమని యాతఁడు తలంచెను. ఆతని భార్యయగు మనోరమ, తన నాథుని యుద్ధమునకుఁ బోవలదనియుఁ, బరశురాముని శరణంబు వేడుట యుక్తమనియు, నెంతయో బోధించెను. కాని యాతఁడు వినలేదు. ఇప్పటికే బాహువులఁ గోల్పోయి సగము చచ్చి పోయెను. అట్టివాఁడు యుద్ధమును మానునా? భార్య హితమును బాటింపక, కార్తవీర్యుఁడు యుద్ధమున కరిగెను. తండ్రికి సహాయ

ముగా నాతని కుమారులును, నాతని వెంట యుద్ధమున కరి గిరి. ఆనాఁడు పరశురాముఁడు మూర్తీభవించిన సంహారక కర్తవలె నుండెను. ఆతనిఁ జేరిపాఱఁ జూచుటకే ప్రతి వారికిని భయము గలుగుచుండెను. కార్తవీర్యుఁడు కుమారు లతో రణరంగమున కరుదెంచినంతనే, జామదగ్న్యుఁడు రోషకషాయిత నేత్రుఁడగుచు మును ముందుగ నాతని కుమారులపై కరిగి ప్రథమాహుతిగా వారలను దన కుఠార మున కర్పించెను. కుమారులచావును జూచి కార్తవీర్యుఁ డోడలు మఱచిన వాఁడై యొక పెట్టున నాతని నెదుర్కొని తీవ్ర నారాచంబుల మిపుల నొప్పించుచుఁ దుదకు మోహనా స్త్రమును బ్రయోగించి యాతనిని మూర్ఛితునిఁగా నొన ర్చెను. కొంత వడికి పరశురాముఁడు మూర్ఛనుండి తెప్పరిల్లి, యీ యవమానమును భరింపఁజాలక, యాతనిపైఁ బాశు పతాస్త్రమును, నాతని సైనికులపై నారాయణాస్త్రమును నొక్క మారుగఁ బ్రయోగించెను. ఆయస్త్రములు రెండును బెనుమంటల నెగఁజిమ్ముచు బయలుదేరెను. వానిఁ జూచి నంతనే కార్తవీర్యుఁడును, నాతని సైనికులును గడగడ వడంక దొడంగిరి. భయపడి పారిపోవుదురేమోయని, పరశు రాముఁడు వారల నందఱిని బ్రహ్మాస్త్ర ప్రయోగంబున బంధించి వైచెను. ఇంకఁ జెప్పున దేమున్నది? పాశుపతాస్త్ర

స్త్రంబు వలనఁ గార్తవీర్యుఁడును, నారాయణాస్త్రంబువలన నాతని సైనికులును సమూలముగా నశించిరి. అప్పుడు పరశు రాముఁడు, కార్తవీర్యుని యొక్కయు, నతని కుమారుల యొక్కయు, క్రొన్నెత్తుటితోఁ బితృ దేవతలకుఁ దర్పణం బొనర్చెను. ప్రతిజ్ఞను సంపూర్తిగాఁ బాలించుటకై యట నుండి బయలుదేరి, భూప్రదక్షిణ మొనర్చుచు నిరువదియొక్క మారు క్షత్రియవంశమును నిర్మూలించి యేతద్వంశజుల తల లతో స్వర్గమునకు సోపానములఁ గట్టెను. భూభార మిప్పటికిఁ దగ్గెను. ఆతని కిప్పుడు శాంతి గలిగెను.

ఈ దారుణ కర్మంబువలనఁ దన్నుఁ జుట్టుకొనిన దురి తంబును బోఁగొట్టుకొనుటకై, సమస్త పాపములను హరించు నట్టి కామరూపతీర్థమున కరిగి తపము సేయఁ దొడంగెను. పెద్దగాలంబునకుఁ దన యవతారంబు పూర్తి యగుట వలన శ్రీరామచంద్రుని నెదుర్కొని, తన యందున్న విష్ణ్వంశను నా మహనీయుని పరంబొనర్చి, నాటనుండి సామాన్య విప్రుని వోలె మహేంద్రపర్వతంబు పొంత నాశ్రమంబు గట్టికొని జీవింపఁ దొడంగెను. ద్వాపరయుగంబున భీష్మునకు ధనుర్వి ద్యను నేర్పి తన యంతవానిఁగా నొనర్చి, తన విద్యను నశించి పోకుండు నట్లొనర్చెను. ఈ విధముగాఁ బరశురాముఁడు పితృ

దేవతలకు మనశ్శాంతినిఁ గలిగించి 'పితృదేవోభవ, మాతృదేవోభవ' యను దాని కాదర్శనీయుఁడై జగంబున వాసి కెక్కెను.

## ౨. మాధవవర్మోపాఖ్యానము.

(పద్మపురాణాంతర్గతము.)

జంబూద్వీపమునఁ దాళధ్వజమను పురవరం బొండు గలదు. అప్పురవరంబును మాధవవర్మయను నతఁడు పరిపాలించుచుండెను. ఇతఁ డవివాహితుఁడు. రూపయౌవన సంపన్నంబున వివాహమునకుఁ దగియుండెను. మాధవవర్మ యొకనాఁడొంటరిగ విహారంబున కరిగి మధ్యాహ్నకాలమునకుఁ దిరిగి తన పురంబునకు వచ్చుచుండెను. అట్టియెడఁ దత్పురసమీపంబున నున్న యొక సరోవరంబుచెంతఁ జంద్రకళ యను నొక చిన్నదానిఁగాంచి తదీయ రూపరేఖావిలాసంబులకు మనంబు చలించినవాఁడై యామెయెడల మోహముంగొని, యామెను సమీపించి 'ఓతరుణీమణీ! నీవెవ్వరవు? నిన్నుఁ బుత్త్రికగాఁబడసిన పుణ్యాత్ములెవ్వరు? జగన్మోహిని వగునిన్ను భార్యగాఁబడసిన యాధన్యాత్ముఁ డెవ్వఁడు! నీభావన

మోహనరూపమునకు, నీసౌకుమార్యమునకు, నీయౌవనం
బునకు, నీవొనర్చు పని యెంతమాత్రమును సరిపడుటలేదు.
దాసదాసీజనంబులచే నూడిగంబులఁ గొనవలసిన నీవు, కేవల
మొకపరిచారిక విధంబున నీళ్లుమోయుటయా? తగదు. ఈ
పని యెంతమాత్రమును నీకుఁదగదు. నే నీజంబూద్వీపము
నకుఁ జక్రవర్తిని. అవివాహితుఁడను. కావున నన్నుఁ జేపట్టుము.
నీరూపరేఖావిలాసములు నన్ను మోహసాగరమున ముంచి
వేసినవి' యని తన హృదయమును నామెకుఁ దెలియఁజేసెను.
చంద్రికళ యాతని మాటలకు వెఱఁగుపడి 'అయ్యో! ఒంటరి
పాటున నేఁడీతనికంటఁ బడితినేల? ఇతఁడు రాకుమారుఁడు.
ఏమిచేయుటకును సమర్థుఁడు. వ్యతిరేకముగా మాటలాడిన
బలాత్కరించునేమో? నాసౌశీల్యమును గాపాడుకొనుటెట్లు?
ఈతని నొప్పింపక నేనిందుండి వెడలిపోవుటెట్లు? కానిమ్ము.
అన్నిటికిని బరమేశ్వరుఁడే గలఁ'డని తనలోఁదాను గొంత
తడవు తర్కించుకొని, యాతనిఁజూచి 'ఓరాకుమారా! కుల
కాంతనై యున్న నన్నుఁగూర్చి నీవిట్లువల్కుట భావ్యమా?
నేటివఱకుఁ బరులకంటఁబడి యెఱుంగను. నీవు పాలకుఁడవు.
మా కందఱికిని దండ్రి వంటివాఁడవు. అట్టియెడఁ గొమార్తె
నైన నా మీఁద మోహమును గొనుట నీకు ధర్మమా? అది
గాక, నాకంటె మించిన రూపవతులెందఱోగలరు. వినుము.
నీకుఁ దగిన యొక సుందరీమణిగలదు. ఆమె పేరు సులోచన.

ఇంకను నవివాహిత. నీకుఁ దగిన సుందరియగుటయేగాక, యామె నిన్నుఁ గోరి యున్నది. కావున నీ వామెను బరిణయంబాడి సుఖింపు'మని నుడువ మాధవవర్మయు నామెను గాంచి, 'ఓ కులవతీ! ఆమె వృత్తాంతమెట్టిది? ఆమెను నేనెట్లు పొందఁగలను? సవిస్తరముగాఁ దెల్పు'మని యడిగెను. చంద్రకళయు రాకుమారుని మనోభిప్రాయంబు మారి నందుకు సంతోషించి 'ఓరాకుమారా! సులోచన దీప్తిపురాధీశుని తనయ. సముద్రము మధ్యనున్న ప్లక్ష ద్వీపమున నాదీప్తి పురమున్నది. ఆమె తండ్రిపేరు గుణాకరుఁడు. తల్లి పేరు సుశీల. అమె నిన్ను వరించి, యేతద్వృత్తాంతమును నీకుఁ దెలుపుటకై, తన చెలికత్తె నొకదాని నిటకుఁ బంపినది. కాని నీ దర్శన మామెకు లభింపలేదు. నీ వచ్చటి కరిగినచో సులోచన నిన్నుఁ దప్పక వరించును. ఆ పురమున గంధిని యను మాలాకారిణి యొక్కతె గలదు. ఆమె కడకరిగినచో నీ కన్నియు సమకూరును. సముద్రమును దాటు టెట్లని నీవు విచారింపవలదు. నీ యశ్వశాలలో, భద్రాశ్వమను నొక గుఱ్ఱము గలదు. అది యుచ్చైశ్రవము యొక్క యంశమున జన్మించినది. అదియొక నిముస కాలముననే పదునాల్గు భువనములను జుట్టి రాఁగలదు. కావున నీ వద్దాని నధిష్టించి దీప్తి పురమును జేరుము. నీ కన్నియు సాను కూలములగు'నని

తెలిపి, యాతని యనుజ్ఞను గైకొని, యామె గృహంబున కరిగెను.

మఱునాఁడు మాధవవర్మ చంద్రికకు తెలియఁజేసిన ప్రకారము, పరిచేష్టఁడను నొక సేవకుని వెంటఁగొని, భద్రాశ్వము నెక్కి, సురక్షితముగా దీప్తిపురమును జేరెను. అచ్చోట నిజసేవకుని వలన గంధిని నివాసస్థానమును దెలిసికొని, యామె కడకరిగి, మాధవవర్మ తాను వచ్చిన కార్యమును గూర్చి తెలియఁజేసెను. అప్పుడు గంధిని విచారము నభినయించుచు, 'ఓ రాకుమారా! సులోచన నిన్ను వరించినమాట నిజమే. కాని నీవు దురదృష్టవంతుఁడవు. రెండు మూడు దినములకుఁ బూర్వమే నీవు వచ్చియున్నచో నీకోరిక నెఱవేరియుండును. నిన్ననే యామెకు ముహూర్తము నిశ్చయమైనది. కుశద్వీపపుచక్రవర్తి కుమారుఁడైన విద్యాధరున కామె నిశ్చయింపఁబడినది. నీకు వృథాప్రయాసమేగాని లాభ మెంత మాత్రమును లేక పోయెఁగదా ?' యని పలుక మాధవవర్మ యెంతయు దిగులువడి 'గంధినీ ! నిన్ను నమ్ముకొని నేనిచ్చటికరుదెంచితిని. వివాహము నిశ్చయమైనంత మాత్రమున నాకోరిక నెఱవేరుటకుపాయము లభింపక పోవునా ? ఇది యించుకయు నీకే తెలియును. తగిన విధమునఁ బ్రయత్నింపుము. ఇదిగో! ఈ యుత్తరమును సులోచనకిచ్చి నన్నుఁ జేయుము.

నీ కష్టమునకుఁ దగిన ఫలము లభింపకపోదని మఱివి మెడలోని రత్నహారము నొక దానిఁ దీసి యామె చేతియందుఁ బెట్టెను. గంధినియు నాతని మనోవిచారమును జక్కఁగా గుర్తించి తనశక్తి వంచన లేకుండ సహాయ మొనర్ప నిశ్చయించుకొని, పూలమాలయందు మాధవవర్మ యొసంగిన జాబును గుప్తముగా నుంచి సులోచన కందఁ జేసెను. సులోచనయు నా జాబును దిలకించి కార్యము మించినందుల కెంతయుఁ జింతించియు, మొదటినుండియు మాధవవర్మనే మనసార ప్రేమించియున్న దగుటవలన నా రాత్రి యెట్టైనను నాతనిని సందర్శించి, తన కోరికయు, నతని కోరికయు నెర వేఱుటకుఁ దగిన యుపాయము నాలోచింప నిశ్చయించు కొనెను. ఆనాటిరాత్రి యందఱును గాఢనిద్రాపరవశులై యున్న కాలమున సులోచన తన చెలికత్తెతో బయలుదేరి గంధిని యింటికరుదెంచెను. ఆమెకును, మాధవవర్మకును ముఖావలోకనమయ్యెను. అప్పటి కప్పుడే, యిరువురి మనో భూములందు మొలచియున్న మోహాంకురము, పెరిగి పెద్ద దయ్యెను. మన్మథుఁడే మానవాకారమున నవతరించెనని సులోచనయు, రతీదేవియే మర్త్యభామినీరూపంబున నవతరించెనని మాధవవర్మయు, నొకరినొకరుఁ దలఁచి యిట్లు తలంప సాగిరి. అప్పుడు సులోచనయే యుపక్రమించి నాథుఁడా,

నీవు ప్రయోజనములేని శ్రమకులోనైతివి. నాతండ్రి నన్ను
గుణద్వీపచక్రవర్తి కుమారున కియ్యఁదలంచెను. రేపురాత్రియే
సుముహూర్తము జరుగును. కార్యము మించిపోయినది. అయి
నను జింతింపవలదు. నిన్నుదక్క నొరుని వివాహమాడు
టకు నాహృదయ మంగీకరించుటలేదు. నిశ్చయింపఁబడిన
వరుని నిప్పుడు తిరస్కరించుట కులవతులకు భావ్యముగాదు.
కావున నొక యుపాయమును దెల్పెదను వినుఁడు. రేపురాత్రి
నన్ను వివాహవేదిక యొద్దకుఁ దీసికొని వచ్చునప్పుడు నేను
నాహస్తముల నెత్తికొని నిలిచియుందును. చేతనగుచో నప్పుడు
నన్ను మీరు గొనిపొండు. అట్లయినఁ గులవతీ ధర్మమునకు
లోపము గలుగదు. ఇందువలన మన కోరికయు నెఱవేఱును.
ఇది నిశ్చయ'మని తెలిపెను. మాధవవర్మ యప్పుడు విచార
మంతయుఁ దొలఁగిపోయెను. భద్రాశ్వముయొక్క సహా
యంబు వలన నీపనిని మిక్కిలి సులభముగా నెఱవేర్పవచ్చు
నని యాతఁడు ధైర్యము నవలంబించెను. సులోచన తిరిగి
మఱియొక్కమారు తన మనోహరుని గన్నులారఁ దిలకించి
పోలేక పోలేక, చెలికత్తెతో గృహంబున కరిగెను.

మఱునాఁడు విద్యాధరుఁడు సుముహూర్తమున కరు
దెంచెను. మాధవవర్మ రాత్రియంతయు మేల్కొనియుండ
వలసివచ్చునని యాపగటిపూట నిద్రించెను. అదియును

మాయరోగాని, యాతని కంఠవటిలకును మెలకువరాదు కా
దయ్యెను. మాటుచుండఁగనే చీకటిపడెను. వివాహకాలము
మిక్కిలి సమీపించెను. మాధవవర్మ కింకను మెలకువ రాలేదు.
అప్పుడు ప్రచేష్టుఁడును, గంధినియు నాతనిని మేల్కొలుప
యత్నించిరి. కాని యిప్పటికిని మెలకువ రాదయ్యెను. ఆల
సించినచోఁ గార్యమంతయుఁ జెడిపోవునని, గంధిని యాలో
చనము ననుసరించి, ప్రచేష్టుఁడు భద్రాశ్వము నధిరోహించి
గగన మార్గమున కెగసెను. అచ్చటనుండి క్రిందికిఁ జూడఁగ,
వేదిక యున్న స్థలమున సులోచన చేతులెత్తికొని నిలిచి
యుండెను. వెంటనే ప్రచేష్టుఁడు క్రింది కరుదెంచి
యామెను పైకి లాగికొని కను ఱెప్పపాటు కాలములో
నదృశ్యుఁ డయ్యెను. మొదట నాతఁడు బయలు దేరు నప్పుడు,
సమయము మించినఁ గార్యము చెడి పోవుననియుఁ దన యజ
మానుఁడు నిద్ర మత్తుచే నప్పుడు లేవకున్నను, దరువాతఁ
గార్యము చెడి పోయినందుకు మిక్కిలి దుఃఖించుననియు,
దానా సమయమున కరిగి సులోచనఁ గొని వచ్చి, తన యజ
మానున కొప్పగించినచోఁ దన్నతఁడు మెచ్చుననియుఁ దలంచి
యుండెను. కాని, యిప్పుడు మాత్ర మాబుద్ధి నశించినది.
సులోచనను దానె పెండ్లి యాడవలయునని యాతఁడు తలంచి
[illegible]త్రమును దాటి పోవలసినదని భద్రాశ్వమున కాజ్ఞ

పింపఁగా నది యట్లొనర్చెను. సూర్యోదయ మగునప్పటికి వారొక పుర సమీపారణ్యమున దిగిరి. అంతఁ బ్రచేష్టుఁడు సులోచనను జూచి "తరుణీ! నిన్నుఁ బ్రేమించిన మాధవవర్మ గాఢ నిద్రాపరవశుఁడై, చేయవలసిన కార్యమును మఱచెను. నే నతని సేవకుఁడను. నన్నుఁ బ్రచేష్టుఁడని పిలతురు. చాల శ్రమపడి నిన్ను నేను దీసికొని వచ్చితిని. నీకుఁ బ్రాప్తమున్నట్లు జరిగినదని, బ్రహ్మ మన యిద్దఱిని జతగాఁ గూర్పఁ దలంచియుండ, మాధవవర్మనుగాని, విద్యాధరునిఁగాని నీ వెట్లు పెండ్లియాడఁగలవు? ఆ విషయమును గూర్చి యిప్పుడు విచారింపనేల? నిన్ను నేను మనసారఁ బ్రేమించితిని. నీకుఁ దగిన యీడు గలవాఁడను. కావున నన్ను వివాహమాడుము. ఈ భద్రాశ్వ మున్నంతవఱకును మన కెందును భయములేదు. మన కెందును గొఱంతయునులేదు. నన్నొంత మాత్రమును నిరాకరింపవల"దని పలుక సులోచన "హా! హతవిధీ! ఏమి నీ చర్య? రారాజులు ప్రేమింప వలసిన నన్నుఁ గులహీనుఁడగు సేవకుఁ డొక్కఁడు ప్రేమించునయ్యా? తండ్రిమాట జవదాటినందుకుఁ గలిగిన ఫలమాయిది? అయ్యో! ఒంటరి దాననే, వీని బారినుండి తప్పించుకొను టెట్లు? కానిమ్ము, యత్నించి చూచెద"నని తనకుఁ దాను సమాధానమును జెప్పుకొని యా సేవకునిఁ జూచి "ప్రచేష్టా! నీ కంటె నాకు దిక్కెవ్వరు గలరు? నే నన్ని విధముల నీ దాననే." అనియెను నతఁడు సంతోషి

క్తముగాఁ బెండ్లియాడుట మంచిది. ఇంతలో మించి పోయిన దేమిగలదు? ఇదిగో! ఈ సొమ్ములను గొనిపోయి, వివాహమునకు వలయు వస్తువులను, నీ పట్టణమున నిలిచి కొనిరమ్ము. నేఁడే పెండ్లి యాడవచ్చు’నని చెప్పి తన సొమ్ములలోఁ గొన్నింటిని నాతని కొసంగెను. ప్రచేష్టుఁడును సులోచన మాటలు నిక్కువములని నమ్మి యనతి దూరముననే యున్న కాంచన నగరంబున కరిగెను. వాఁడరిగిన వెంటనే సులోచన, తన మనోహరుఁడు తనకుఁ దిరిగి లభించు నంతవఱకు గంగయొడ్డునఁ దపము సేయుచుఁ గాలమును గడుపవలయుననియుఁ బెద్దయుఁ బ్రొద్దునకుఁ గూడ నాతఁడు లభింపకున్న గంగలోఁ బడి ప్రాణములఁ బాయ వలయుననియు, నిశ్చయించుకొని, భద్రాశ్వము నెక్కి గంగాతీరమున కరిగెను. ఆహా! స్త్రీల మనోభావముల గుర్తింప నెవ్వరికిని నలవి గాదుగదా?

అట్లు సులోచన భద్రాశ్వము నెక్కి వినువీథినిఁ బోవుచుండ నామెకు విమానచారులగు కొందఱు గంధర్వకాంతలెదురుపడి, వారును సులోచనయొక్క యద్వితీయ సౌందర్యాతిశయంబును విస్మయపడి, యామె వృత్తాంతమును గూర్చి యామెనే ప్రశ్నింప సులోచనయుఁ దనచరిత్రంబు సర్వంబును సమగ్రంబుగా వారలకుఁ దెలియఁజేసెను. అప్పుడా

గంధర్వకాంతలు సులోచనయెదలఁ గరుణవహించి 'తల్లీ! నీ వెంతమాత్రమును జింతపడవలదు. నీనాథుఁడు నిన్నుఁ ద్వరలోనే కలిసికొనఁగలఁడు. ఆత్మహత్యకు నీవు పాలుపడ నక్కఱలేదు. ఇదిగో! ఇంద్రజాల మంత్రమును నీకుపదేశించెదము. తెలిసికొనుము. దీనివలన నీకన్నియు సాధ్యములగును. సర్వశుభములుఁ గలుగు'నని చెప్పి యామంత్రము నుపదేశించి యథేచ్ఛఁజనిరి. అంతట సులోచనయుఁ బ్రయాగ కరిగి, యచ్చట గంగలో స్నానమాచరించి, యథారూపమున నుండుట యపాయకరమని యెంచి, పురుష వేషమును దాల్చినదై, ప్రయాగదేశాధీశుని కడకరిగి, తన కన్నివిద్యలు దెలియుననియు, మంత్రశాస్త్రములన్నియుఁ గరతలామలకములనియు, సస్త్రశస్త్రములయందు మంచి నేర్పుగలదనియు, నితరుల కసాధ్యములైన పనులు, దనకుసాధ్యములనియుఁ దెలియఁజేసి యానృపాలుని యొద్దఁ గొలువునకుఁ గుదిరెను. అతఁడును, బురుషవేషమున నున్న సులోచనను, న్యాయాధికారిగానుండి, దోషులను శిక్షించుచుండ వలసినదని తెలిపి, గంగాతీరమునకు సమీపమునందే యుండుటకొక భవనము నొసంగెను. సులోచనయుఁ దన రహస్యమును జక్కఁగాఁ గాపాడుకొనుచు నియమిత కార్యమునం దప్రమత్తురాలై యుండెను.

ఇట్లుండఁగొన్ని దినంబులకు గండామృగంబను నొక భయంకర జంతువు ప్రయాగదేశమును జొచ్చి జనులను లెక్కకు మిక్కిలిగాఁ జంపఁదొడంగెను. ఆమృగమును వాఁత మొనర్పవలయునని, శూరులని పేరువడసిన వారెందఱెందఱో యరుగుచుండిరి. అరిగినవారు తిరిగివచ్చుటలేదు. ఆమృగ మొక్కరికిని జిక్కుటలేదు. ఒకవేళ యెదుటఁబడిన, దానిఁ జూచినంతనే, చంపఁబోయిన వారు హృదయము చెదరి చని పోవుటయో, లేక కొంతవఱకు దానితోఁబోరాడి, తుదకు దానిచేతఁ జంపఁబడుటయో సంభవించుచుండెను. ప్రజలంద ఱును ప్రాణముల కొఱకు భయపడఁజొచ్చిరి. తన ప్రజల కిట్టి దురవస్థగలిగి నందుకుఁ దద్రక్షకుండగు సుషేణుఁ డెంతయో విచారపడఁజొచ్చెను. తుదకాతఁడేమియుఁ బాలు వోవక, యామృగమును జంపినవానికిఁ దన కొమార్తెనొసఁగి యర్ధరాజ్యంబు నిత్తునని యెల్లెడలఁ దెలియపఱచెను. కాని కృతకృత్యులైన వారెవ్వరును లేకుండిరి. సులోచన యీకా ర్యము నెప్పుడో నెఱవేర్చియుండునుగాని, యారాకుమార్తెను బెండ్లియాడు టెట్లాయని యాకె విచారింపసాగెను. కాని యుపేక్షించుట వలనఁ బ్రజానష్ట మధికమగునని యెంచి యొకనాఁడు భద్రాశ్వము నధిష్ఠించినదై, గగనమార్గమున కెగసి, యామృగముండు చోటును దెలిసికొని, పైనుండి

యనాయాసముగా నద్దానిని రూపుమాపెను. తరువాత
నామృగము రాజసేవకులవలన దర్బారునకుఁ గొనిరాఁబడెను.
చచ్చిపడియున్న దానిఁజూచుటకే, యచ్చటనున్న వారంద
ఱును భయపడిరి. అప్పుడు సుషేణుఁడు తాను నుడివిన ప్రకార
మొక శుభముహూర్తంబునఁ బురుషవేషంబుననున్న సులో
చనకుఁ దనకుమార్తెనొసంగి వివాహమొనర్చి, యర్ధరాజ్యాధి.
పత్యంబు నొసంగెను.సులోచనయు నారాకుమారిని, నిదివఱకు
దానుండు భవమునకుఁ దీసికొనివచ్చి, యొకనాఁడామెనఁజూచి
'రాకుమారీ! నేనొక కార్యార్థమై, నియమము పూని బ్రహ్మ
చర్యవ్రతముతో నున్నాను. కావున నీవు కొంతకాలమోర్చి
యుండవలయును. తరువాత మనము సుఖింపనచ్చు' నని
తెలుప నందుకామెయు మహాసంతోషముతో సమ్మతించెను.

సులోచన వీరవరుఁడను పేరుతోఁ దన కృత్యము పట్ల
మెలంగు చుండెను. వీరవరుఁ డిదివఱకే, గంగలో నెవ్వ
రైనఁబడి యాత్మహత్యగావించు కొనుటకు సిద్ధపడిన యెడల
నట్టివారినిఁ బట్టికొని తనకడకుఁ గొనిరావలసినదని తన
సేవకుల కాజ్ఞాపించియుండెను. ఇట్లుండ నచ్చోట వివాహ
సామగ్రి కరిగియున్న ప్రచేష్టుఁడు తిరిగి వివాహ సామగ్రితో
యథాస్థానమున కరుదెంచి సులోచనను గానక, యెంతయుఁ
జింతించినవాఁడై, చేయునది లేక తుదకు గంగలోనైనఁబడి

ప్రాణములు విడిచి, జన్మాంతము నందైన సులోచనను బొంద వచ్చునని తలంచి ప్రయాగకరిగి గంగలోఁ బడి యాత్మ హత్య గావించుకొన సిద్ధపడెను. అట్టియెడ వీరవరుని భటులా తనిఁ బట్టికొని, తమ ప్రభువుచెంతకుఁ గొని పోగా, నాతఁడును ప్రచేష్టుని గుర్తించి కారాగృహమున నుంచవలసినదని యాజ్ఞా పించెను. మఱి కొన్నినాళ్ళకు విద్యాధరుఁడు గూడ, ప్రయాగ కరిగి గంగలో దుమికి యాత్మహత్య గావించుకొన నున్న సమయమున నెప్పటివలె వీరవరుని భటులాతనిని దమ ప్రభువు కడకుఁ గొనిపోయిరి. ఆతఁడును విద్యాధరుని గురు తించి కారాగృహమున నుంప వలసినదని యాజ్ఞాపించెను. మఱి కొన్నినాళ్ళకు మాధవవర్మయు నిట్టి యభిప్రాయము తోడనే ప్రయాగ కరుదెంచెను. ఆతనిఁ గూడ వీరవరుని భటులు తమ ప్రభువుచెంతకుఁ గొనిపోవ నాతఁడు మాధవ వర్మను గురుతించి, తగినట్లు గౌరవించి, ప్రచేష్టుని, విద్యా ధరుని, నచ్చటికి రప్పించెను. వారువచ్చిన యనంతరము వీర వరుఁడు వారలనుజూచి ‹ఓయీ! గంగలోఁబడి మీరేల యాత్మహత్య గావించుకొనఁ దలంచితిరో సవిస్తరముగాఁ దెలియఁ జేయుఁడని ప్రశ్నించెను. అప్పుడు ప్రచేష్టుఁడు తన వృత్తాంతము నంతయు సవిస్తరముగాఁ దెలియఁ జేసెను. ఆతఁడు తెలియఁజేయుట ముగించినంతనే, వీరవరుఁడుమాధవ

వర్మనుజూచి 'మహాశయా! ఇట్టివాని కెట్టిశిక్ష విధింపవల యునో తెల్పుఁడని యడుగ నాతఁడును మరణదండనమై నను, లేక యాజన్మకారాగృహమైనను నట్టి వానికిఁ దగిన శిక్షయని తెలుప నాతఁడు ప్రచేష్టున కాజన్మ కారాగృహవాసశిక్షను విధించెను. అనంతరము విద్యా ధరుఁడు 'అయ్యా! నేనొక చక్రవర్తి కుమారుఁడను. ఇప్పుడు తెలుపఁబడిన సులోచనను నాకిచ్చి వివాహమొనర్చుట కామె తల్లిదండ్రులచేత ముహూర్తము నిశ్చయింపఁబడుటయేగాక, వివాహము గూడఁ బ్రారంభింపఁబడెను. అట్టియెడ నామె నెవ్వరో పైనుండి వచ్చి కొనిపోయిరి. ప్రచేష్టుని వాక్యముల వలన నాపని నొనర్చిన వాఁడతఁడేయని తెలియుచున్నది. ముహూర్తము స్థిరపఱుపఁబడినను, సులోచనకు నామీఁద మనస్సులేదు. ఆమె మాధవవర్మయను నాతనిని మనసారఁ బ్రేమించెననియు, నాతని వలననే యామెయట్లుగొనిపోఁబడిన దనియు నా కామె చెలికత్తెల వలనఁ దెలియవచ్చినది. నన్నుఁ బ్రేమింపని కాంతను గూర్చి విచారపడుటకంటె నీ దేహమును జాలించుటయే యుత్తమమని తలంచి, ప్రయాగలో గంగా నదియందుఁ బ్రాణములఁ గోలుపోవుట సర్వార్థసిద్ధికి మూల మని యెఱింగినవాఁడ నగుటవలన నాత్మహత్య గావించుకొన సిద్ధపడితిని. ఇదియే నావృత్తాంత' మని తెలియఁ జేసెను.

అంతట వీరవరుఁడు మాధవవర్మను జూచి 'ఇతనిఁగూర్చి యేమి చెప్పెద'రని యడుగ, నట్టివానికి వైరాగ్యము యుక్తమని తెలిపెను. వీరవరుఁడును విద్యాధరునకు వైరాగ్యమును బోధించి, తన్మూలమునఁ దరింపవలసినదని పంపివైచెను.

తరువాత వీరవరుఁడు మాధవవర్మను జూచి 'అయ్యా! ఆసులోచనను గూర్చి మీ యభిప్రాయమేమి? ఒక వేళ యామె తిరిగి లభించినచో నామాధవవర్మ యామెను బరిగ్రహించునా?' యని ప్రశ్నించెను. అప్పు డతఁడు, సులోచన శీలమున కెంతమాత్రమును భంగము గలుగలేదనియు, నామె లభించినచో మాధవవర్మ తప్పక పరిగ్రహించుననియుఁ దెలుప, వీరవరుఁ డేదోపనిమీఁద నరిగినట్లు లోనికరిగి, యథారూపమును గైకొని బయటి కరుదెంచెను. సులోచనను గాంచి నంతనే మాధవవర్మ విస్మయాశ్చర్యభరితుఁ డయ్యెను. అప్పుడు సులోచన తన వృత్తాంతంబు సర్వంబు నాతనికిఁ దెలియఁజేసి, యాతనితో సుషేణుని కడకరిగి, యాతనికిఁ గూడ సర్వంబును దెలియ పఱచి, తనను నాతని పుత్త్రికను, మాధవవర్మ కొసంగి వివాహమొనర్పవలసినదని తెలుప, నాతండు మహానందములోఁ బెండ్లిచేసెను. మాధవవర్మ భార్యలతో సుఖంబుండెను.

బాలకులారా! కష్టపడిన వారే తుదకు సుఖపడువారు.

---

# 3. అనిరుద్ధోపాఖ్యానము.

(బ్రహ్మవైవర్తపురాణాంతర్గతము.)

శ్రీకృష్ణభగవానునకు రుక్మిణీదేవియందుఁ బ్రద్యుమ్నుఁడను కుమారుఁడు జనించెను. ఇతనినే మనము మన్మథుఁడని పిలుచునది. మన్మథునకు రతీదేవియం దనిరుద్ధుఁడను నొక కుమారుఁడు గలిగెను. అనిరుద్ధుఁడు తండ్రివలెనే యద్వితీయ సౌందర్యవంతుఁడు. సౌందర్యవంతుఁడేగాక యాతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు గూడనై యుండెను. అనిరుద్ధున కింకను వివాహముగాలేదు. ఆతఁ డొకనాటిరాత్రి నిద్రనుమునింగి స్వప్నావస్థయం దుషయను నొకకన్యకామణిని దిలకించి యామె రూపలావణ్యాతిశయంబులకు ముగ్ధుఁడై యామెను మనసారఁ బ్రేమించెను. కాని యామెయెవ్వరో, యెందుండెనో, తన కామె యెట్లులభించునో, యాతని కెంతమాత్రమును దెలియ వచ్చినదికాదు. అందువలన నాతఁ డహరహంబు నుషాకన్యను గూర్చి విచారించుచు మదనజ్వరంబున నానాటికిఁ జిక్కిపోఁ దొడంగెను.

ఉషాకన్య బాణాసురుఁడను నొక దైత్యవల్లభుని కూతురు. ఇతఁ డనుపమాన శివభక్తిపరుఁడు. ఈతనికి వేయి చేతులుగలవు. నిత్యమును దన వేయిచేతులతో శివుని నర్చించు

చుండెడివాఁడు. పరమేశ్వరుఁ డీతని భక్తికి మెచ్చి యాతఁడు కోరిన ప్రకారమాతని యింటివాకిటఁ గావలివాఁడై యుండెను. బాణాసురుఁ డొకప్పుడు శివుని చెంతకరిగి "మహా దేవా! నా సహస్ర బాహువులకుఁ దగినంత పని లభించుట లేదు. కావున నాతో యుద్ధ మొనర్చుటకు ర'మ్మని పలుక శివుండును బాణుని మదోన్మత్తతకుఁ గినుక వహించి వెలికిఁ దోపనీయక నగుచు "బాణా! జగదేకపరాక్రముఁడ వగు నీతో నేను బోరఁగలనా? కొంతకాలము వేచియుండుము. నీ చేతుల తీట మాన్పఁగల సమర్థుఁ డొక్కఁడు నీకు లభింపఁ గలఁడు. అప్పు డాతనితో యుద్ధ మొనర్పుము. నీ వేయి చేతులకుఁ దగినంతపని లభించును. నీ రథము టెక్కెము విరిగి యెప్పుడు క్రిందఁబడునో, యానాఁడు నీ కాదివ్యపురు షునితోఁ బోరు లభించునని యెఱుంగు'మని తెలియఁజెప్ప, బాణుండును, సద్దానికి నిరీక్షింపఁ దొడంగెను.

ఇతని సమాచార మిట్లుండ నితనితనయ యగు నుష, తన సౌందర్యమునకుఁ దగిన వరుని సమకూర్ప వలసినదని సంతతము గౌరినిఁ బూజింపఁ దొడంగెను. గౌరీదేవియు నుషాకన్యయెడలఁ గరుణవహించి, యొకనాఁడు పూజసేయు చున్న సమయమున నామెకుఁ బ్రత్యక్షమై "కుమారీ! నీవెంత మాత్రమును వరునిఁగూర్చి చింతింపవలదు. అన్ని విధముల

నీకుఁ దగిన వరుఁడే లభింపఁగలఁడు. నేటి రాత్రియే స్వప్న మందు నీ మనోహరునిఁ గాంచఁగల' వనిచెప్పి యదృశ్య యయ్యెను. ఆనాటిరాత్రి యుషాకన్య స్వప్నావస్థయం దనిరు ద్ధునిఁజూచి యాతని రూపరేఖావిలాసంబులకు నబ్బుర పడి యాతనిని మనసారఁ బ్రేమించెను. నాటనుండి యనిరు ద్ధునకుఁ గలిగిన యవస్థయే యీమెకుఁగూడఁ గల్గెను. మదన జ్వరంబున నానాటికిఁ జిక్కిపోవఁ దొడంగెను. అట్టియెడ నామెచెలు లేతద్వృత్తాంతంబు నంతయుఁ దెలిసికొని కారణ మూహింపఁజాలక యామెతల్లికి సర్వంబును నివేదించిరి. ఆమెయుఁ గొమార్తె మనోవిచారంబునకు మూలంబైన దానిగూర్చి తెలిసికొననేరక తనభర్తకుఁ దెలియఁ జేసెను. బాణుఁడప్పుడు కొంతవఱకు విచారించి తన తనయ ప్రియ సఖియగు చిత్రరేఖను రావించి యుషాకన్య మనోవిచా రమునకుఁ గతమేమో సర్వజ్ఞుఁడగు శివుని నడిగి తెలిసి కొని రావలసినదని యాజ్ఞాపింప నామెయు శివుని కడకరిగి సర్వంబును విన్నవించెను. అంత శివుఁడు చిత్రరేఖనుజూచి 'బిడ్డా నీచెలి యనిరుద్ధుని వరించి యాతనికై విచారించు చున్నది. అనిరుద్ధుఁడు రతీమన్మథులకుఁ గుమారుఁడు. శ్రీ కృష్ణునకు మనుమఁడు. అతండిప్పుడు ద్వారకాపురమునందున్న వాఁడు. నేటిరాత్రి నీవు రహస్యముగా ద్వారకానగరంబున

కరిగి, యాతని మందిరంబునుజొచ్చి గాఢనిద్రను మునిఁగి యున్న సమయంబున నాతనిఁగొనివచ్చి యుషాకన్యకుఁ జూపింపుము. దానివలన నీచెలి మనోవిచారంబంతయు నశించును. ఈపనికిఁగాను నీకిదిగో యింద్రజాలవిద్య నుపదేశించుచున్నాఁడను. ఈ విద్యాప్రభావంబువలన నీ వీకార్యమును చక్కఁగా నెఱవేర్పఁగల' వని తెలిపి యావిద్య నుపదేశించెను. చిత్రరేఖయుఁ దన ప్రాణసఖమనోవిచారంబును బాపుటకు సిద్ధపడెను.

ఆనాటిరాత్రి చిత్రరేఖ యింద్రజాల విద్యాప్రభావంబు చేఁ గాలంబున నొరులకుఁ దెలియకుండ ననిరుద్ధుని మందిరంబును జొచ్చి నిద్రాపరవశుఁడై యున్న యాతనిఁ గొనివచ్చుచుండెను. మధ్యమార్గంబున ననిరుద్ధుఁడు మేలుకొని, తన్నుఁ గొనిపోవుచున్న చిత్రరేఖను జూచి 'నీ వెవ్వరిదానవు? ఇట్టి యర్ధరాత్రంబున నొంటరిగ నన్నిచ్చటికిఁ గొని పోవుచున్నావు? తెల్పు'మనియడుగ నామెయు 'ఓపురుషాగ్రణీ! నీకింతమాత్రమును సందేహమువలదు. నేను నీకు మేలుగూర్చుదాననేగాని, చెఱుపుఁ గలిగించుదానను గాను. నీమనోనాయకిదగ్గఱకే నిన్నుఁ గొనిపోవుచుంటిని. నీకోరిక నెఱవేరు' నని తెలుప ననిరుద్ధుఁడును మౌనము వహించెను. అచిరకాలముననే చిత్రరేఖ యాతనిఁగొని, యుషాకన్యమందిరంబును

బ్రవేశించి, యొక్కచో నాతని నాసీనుఁ గావించి, నిదురించు చున్న తన సఖిని మేలుకొలిపి, వృత్తాంతంబు సర్వంబు నామెకుఁ దెలియఁజేసెను. ఉషాకన్యయుఁ దన మనోహరునిఁ గన్నులారఁ జూడ నాత్రముతో ననిరుద్ధుఁ డున్నచోటున కరి గెను. చిత్రరేఖ యేదో పనిగలదని మిష పెట్టి మందిరంబు నుండి వెడలిపోయెను.

అనిరుద్ధునిఁ జూచినంతనే యుషాకన్యకు మొకట భయము గలైను. తరువాత సిగ్గు మెండయ్యెను. ఆ తరువాత మదనవికారము పెల్లయ్యెను. మదనవికార మినుమడించి నంతనే యామె మనోనిగ్రహమును గోలుపోయి యాతనిఁ జూచి 'ఓపురుషవరేణ్యా! మీ నామధేయమెట్టిది?' అని ప్రశ్నించెను.

అని—ఓ తరుణీమణీ! నా పేరనిరుద్ధుఁడు

ఉష—సుందరాకారా! మీ దేశమెయ్యది? మీవంశీయు లెవ్వరు?

అని—ఓసుందరాంగీ! ద్వారకానగరము నా నివాసస్థానము. నాతల్లి దండ్రులు రతీమన్మథులు. తాత శ్రీకృష్ణభగ వానుఁడు. నీ వెవ్వరిదానవు?

ఉష—స్వామీ! నేను బాణుని కొమార్తెను. ఉషయను దానను.

అని—ఇట్టి యర్ధరాత్రంబున నన్నిచ్చటికేల తెప్పించితివి ?

ఉష—తెప్పించుటకు నేనెవ్వతెను ? నాకాసామర్థ్య మెక్కడిది ? పరమేశ్వరి యనుగ్రహంబు వలన మీదర్శనంబు లభించినది.

అని—ఆ యనుగ్రహంబునకైనను దగినకారణ ముండవలయును గదా ?

ఉష—మనోహరా! నేను మీ సౌందర్యాతిశయంబులను విని మీయందు మనస్సును నిల్పితిని. మీ పొందు నాకు లభించు నట్లొనర్ప వలసినదని యా పరమేశ్వరినిఁ బ్రార్థింప నామెయు నాయెడలఁ గరుణ వహించి యిట్లొనర్చినది. నాథా! మీకొఱకై నిద్రాన్నము లనుమాని యెన్నినాళ్ళ నుండియో వేచియుంటిని. నేటికాభవాని కృపవలన నాకష్టమీడేరినది. నన్నింక నలయింపక రతిసుఖంబునఁ దేల్పుఁడు. ఈ మదన తాపంబును బోఁగొట్టుఁడు.

అని—కన్యకామణీ! ఇట్లు వలుకుట కులవతులకు ధర్మమా ? నీవు కన్యకవు. నీ పల్కులు కన్యాత్వమునకుఁ గేవలము విరుద్ధములు. అదిగాక, పరస్త్రీని గోరుట మహాపాపమని పెద్దలు సెప్పుదురు. నిన్ను నేనెట్లు ముట్టఁగలను ?

ఉష—మనోహరా! ఇందుఁ గన్యాత్వమునకు భంగమేమి గలదు? నేను మిమ్మును మనసారఁ బ్రేమించియుంటిని. మీదుమిక్కిలి నేను బరకాంత నెట్లగుదును? ఇంతవఱకు నే నవివాహితను, మిమ్మును వివాహ మాడఁదలంచి యుంటిని. గాంధర్వంబు వివాహంబు లన్నింటి యందుత్తమంబని పెద్దలు సెప్పుదురు. కావున గాంధర్వంబున నన్నుఁ బరిగ్రహింపుఁడు. దీన నెవ్వరికిని దోషంబు గలుగనేరదు.

అనిరుద్ధుఁ డుషా కన్యవాక్యములకు సమ్మతించెను. ఆతఁడుగూడ నామెను హృదయ పూర్వకంబుగఁ బ్రేమించి యుండెను. ఆమె మనస్సును గనుంగొన వలయునని యాతఁ డట్లు వలికెనేగాని యామెమీఁదఁ బ్రేమలేకగాదు. అంత నుషాకన్య యాతని కంఠమున నప్పుడే పూలమాలను వైచి గాంధర్వంబునఁ బెండ్లియాడెను. నాఁడు మొదలు వారిరువు రును నొరులకుఁ దెలియకుండ దాంపత్యసుఖంబుల ననుభ వింపఁ దొడంగిరి. ఆహా! మోహమునకున్న శక్తి యెద్దాని కిని లేదుగదా?

ఉషాకన్యానిరుద్ధుల వృత్తాంతము నెట్లో యామెసఖ జనంబులు దెలిసికొని యుపేక్షించిన బాణునివలనఁ దమకు ముప్పు గలుగునేమోయని భయపడి, యొకనాఁడతనికి సర్వ

మును దెలియఁజేసిరి. అప్పుడతఁడు మంఁశపడుచు నేమిచేయు టకును దోఁచక శివునికడకరిగి యావద్వృత్తాంతమును విన్న వించెను. పరమేశ్వరుండును, బాణునిఁజూచి 'ఓయీ! దీనికై నీవు మండిపడనక్కఱలేదు. అనిరుద్ధుఁడు నీతనయకుఁ దగిన వాఁడు. అతఁడు శ్రీకృష్ణభగవానుని పౌత్రుఁడు. శ్రీకృష్ణుఁడన సామాన్యుఁడుగాఁడు. కేవలమతఁడు శ్రీమహావిష్ణువు. ఆది మధ్యాంతములు లేనివాఁడు. సృష్టిస్థితిలయంబు లామహాత్ముని వలననే జరుగుచున్నవి. బ్రహ్మాదిసకలదేవతలును, నేనును, సర్వదా యామహానీయునిఁ గీర్తించుచున్నాము. కావున నట్టి వానితో బంధుత్వము నెఱపుట నీకు మిక్కుల శ్రేయస్కరము. నాహితమును గైకొని నీవు త్రికను, ననిరుద్ధునకొసంగి పరిణయంబు సేయుము. కాదని కత్తిగట్టుదువేని శ్రీకృష్ణుని వలన నీకుఁ దప్పక పరాభవము జరిగితీరు'నని తెలియఁజేసెను. కాని బాణుఁ డెంతమాత్రమును శివుని హితోపదేశమును గైకొనక 'స్వామీ! దైత్యకులమున కాజన్మవైరియగు శ్రీకృష్ణునితోడనా బాంధవ్యము నెఱపుట! నేనెంతమాత్ర మీ వివాహంబున కంగీకరింపను. అనిరుద్ధుని దండింపక మానను. మీకృపయున్నచో నన్నుఁ గృష్ణుఁడేమి సేయఁగలఁ'డని పలికి యప్పుడే సైన్యములఁ గూర్చుకొని యనిరుద్ధునిపై కరిగెను. అనిరుద్ధుఁడును మునుముందుగనే పరమేశ్వరివలన యుద్ధ

వార్తను దెలిసికొని, యుద్ధమునకు సిద్ధుఁడై, బాణున కెదురు సనెను. బాణుఁడును, నొక్కఁడయ్యుఁ దన్నెదుర్కొన నరుదెంచుచున్న యనిరుద్ధుని పరాక్రమాతిశయంబులకు మెచ్చుకొని, యుద్ధమునకుఁ గడంగెను. ఉభయులకును బోరు ఘోరమయ్యెను. అనిరుద్ధుని ధాటికాగఁజాలక బాణునిసైనికులు పరుగెత్తఁ జొచ్చిరి. బాణుఁడుగూడ నప్పడప్పడాతని పరాక్రమంబునకును, యుద్ధనైపుణ్యమునకును నిర్విణ్ణుఁడగుచుండెను. తుదకునమోఘమహాస్త్రమును బ్రయోగించి యాతని మూర్ఛితునిఁగా నొనర్చి బాణుఁడు చెఱఁగొనెను.

సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు మనుమని వృత్తాంతమును దెలిసికొని, తనవారలకుఁగూడఁ దెలిపినవాఁడై, యాదవబలంబులఁగూర్చికొని బలరామాదులతోఁ దండెత్తి వచ్చి దానవపురంబును ముట్టడించెను. కృష్ణుని నొకసామాన్యమానవునిఁగా నెంచి బాణుఁడుగూడ నిజసైన్యంబులఁ గూర్చికొని పరమేశ్వరునితోఁ గలసి, యుద్ధమునకుఁ గడంగెను. అప్పుడు హరిహరులకును, బలరామబాణాసురులకును, నుభయసైనికులకును బోరు ఘోరమయ్యెను. హరుఁడు పాశుపతాస్త్రమును బ్రయోగింపఁ గృష్ణుఁడు నారాయణాస్త్రమును బ్రయోగించి దాని నుపసంహరించెను. శివుఁడు తిరిగి శివజ్వరమును యాదవసైనికులపై నావేశింపఁజేయ, జనార్దనుఁడు వైష్ణవ

జ్వరమును దానవసైనికులపై నావేశింపఁజేసెను. ఆ రెంటికిని గొంతతడవు పోరుజరిగెను. తుదకు శివజ్వరమే యోడి పోయెను. హరుఁడప్పుడు యుద్ధవిముఖుఁడయ్యెను. శ్రీకృష్ణుఁడంత బలరామునితోఁ బోరుచున్న బాణునెదుర్కొనెను. ఆసమయమున నాతని రథముచక్రము విరిగి నేలఁబడెను. అంత బాణుఁడు తనకుఁదగిన వీరుఁడు లభించెనని బలరామునితోఁ బోరుటమాని శ్రీకృష్ణునెదిర్చి పోరఁదొడంగెను. బలరామ సాత్యకి మన్మథ ప్రముఖులందఱును, దానవ సైన్యములపై విజృంభించి యెక్కడి సైన్యముల నక్కడ రూపుమాపఁదొడఁగిరి. వారి ధాటికోర్వఁజాలక దనుజసైన్యములు పరుగిడఁజొచ్చెను. ఒకవంక నగ్నిహోత్రుఁడు దానవవీరుల నెదుర్కొని సవ్యాపసవ్యంబుగ బాణంబులఁ బ్రయోగించుచుఁ దల యెత్తుటకును, జేయి యాడించుటకును గూడ వీలులేకుండఁ జేయుచు గుట్టలు గుట్టలుగాఁ గూల్చుచుండెను. ఇచ్చట బాణుఁడు శ్రీకృష్ణునిపైఁ బెక్కు దివ్యాస్త్రంబులు బ్రయోగించుచుఁ బోరుచుండెను. అట్టియెడ భద్రకాళి బాణునిపక్షము నవలంబించి శ్రీకృష్ణుఁడు ప్రయోగించు బాణములనన్నింటిని మ్రింగఁదొడంగెను. బాణుఁడు దీనివలన సురక్షితుఁడై కృష్ణునిఁ బెక్కువిధంబులఁ గ్రూరనారాచంబుల నొప్పింపసాగెను. శ్రీకృష్ణునకుఁ గోపమినుమడించినది. భద్రకాళిని, బాణుని నొక్కమారు హతమొనర్పవలయునని నిశ్చయించి,

యరిజనభయంకరంబగు సుదర్శన చక్రాయుధంబును జేతఁ బట్టెను. చక్రాయుధంబును గాంచినంతనే భద్రకాళి భయపడి రణరంగమ్మునుండి తొలఁగిపోయెను. శ్రీకృష్ణుఁడద్దానిని బాణునిపైఁ బ్రయోగించెను. శివుఁడందుకు భయపడి తన భక్తునిఁ బ్రాణములతో రక్షింపవలసినదని కేశవునిఁ బ్రార్థింప నాతండును సమ్మతించెను. చక్రాయుధము బాణుని వేయి హస్తముల నొకటివెంట నొకటిగా ఖండించివైచెను. తుదకుఁ బ్రాణములుఁగూడఁ గొననున్న సమయమున శ్రీకృష్ణుఁడద్దాని నుపసంహరించెను. అప్పుడు బాణుఁడు శ్రీకృష్ణుని చరిత్రంబును దెలిసికొని దీనుఁడై 'దేవా! మాయావిమోహితుండనై, నీసామర్థ్యమును గుర్తింపఁజాలక నీపైఁ గత్తికట్టితిని. నాయపరాధమును క్షమించి నన్నురక్షింపు' మని యనేక విధంబులఁ బ్రార్థింప నాతండును దనుజవల్లభుని యెడఁ గరుణావహించి, వాని చేతులెప్పటియట్ల వచ్చునట్లనుగ్రహించెను. పోరు సమాప్తినొందెను.

హరిహరుల సమక్షమున బాణుఁడప్పు డనిరుద్ధునకుఁ దన పుత్త్రికయగు నుషనొసంగి మహావైభవముతోఁ బెండ్లి గావించెను. పెక్కుకానుకలను, దివ్యాంబరమణిమయభూషణంబులను, గనకవస్తువాహనంబులను, పెక్కువేల దాసదాసీజనంబులను, వధూవరుల కొసంగెను. శ్రీకృష్ణుఁడును, శివుని

యొద్ద సెలవుదీసికొని, వధూవరుల తోడను, బంధుజనుల తోడను, యాదవసైన్యంబులతోడను, గదలి, ద్వారకాపురంబున కరిగెను. ఉషాకన్యానిరుద్ధులును, నాటనుండి సర్వసుఖంబుల ననుభవించుచుఁ గాలమును సుఖముగాఁ గడుపుచుండిరి.

బాలకులారా! తనబలంబును, నెదిరిబలంబును గుర్తెఱుంగక, కలహంబునకుఁ గాలుదువ్వరాదు. ఎంత వారికిని గర్వంబు పనికిరాదు. యుక్తాయుక్తంబులఁ గూర్చి తనకుఁ దెలియనప్పుడు, పెద్దలు సెప్పినప్పుడైనను దెలిసికొనవలెను.

---

## ౪. అజామిళోపాఖ్యానము.

(భాగవతపురాణాంతర్గతము.)

కన్యాకుబ్జపురమున నజామిళుండను నొక భూసురుండు గలఁడు. అతఁడు సత్కర్మపరుఁడు. దాంతుఁడై, శాంతుఁడై, ధర్మసంశీలుఁడై, చతుర్వేదములను జదివినాఁడు. అనయంబు గురువృద్ధజనాతిథిపూజల నొనర్చినాఁడు. సర్వభూతములందును సమభావమును జూపినాఁడు. బహు మంత్ర సిద్ధులను బడసినాఁడు. సత్యభాషణనియమంబును జరపినాఁడు. నిత్య

నైమిత్తికాదులను నేరపినాఁడు. సకల సద్గుణములను దనయందు నిలిపినాఁడు. కాని కాలమెల్లప్పుడొకరీతిగా నుండదు. అది క్షణక్షణమును మారుచునే యుండును. దాని ననుసరించి మానవతత్త్వంబు గూడఁ గొన్ని యెడల మారుచుండును. అజామిళున కిప్పుడు యౌవనము చక్కఁగాఁ బొడసూపినది. ఒకనాఁడతఁడు సమిత్కుశఫలార్థమై వనంబున కరిగి, వానిఁ గొని తిరిగి గృహంబున కరుదెంచు నప్పుడు మార్గమధ్యంబున రతి క్రీడలఁ దేలుచున్న కాముకీ కాముకుల నొక పూఁపొద రింటఁ గాంచెను. వారినిఁ గాంచి నంతనే యాతని చిత్తము చలించినది. కామోద్రేక మినుమడించినది. నాటితో నాతని బ్రాహ్మణత్వముగూడ నశించినది. వృషలియను పేరుగల యాకాముకి యజామిళునకు భార్యయైనది. అది మొదలాతఁ డాత్తనే యాత్మపత్నిగా భావించినాఁడు. సంతతమక్కాంతతో రతిసుఖోపభోగంబుల ననుభవింపఁ దొడంగినాఁడు. నిత్యకర్మంబులేమైనవో, గురువృద్ధజనాతిథిపూజ లెటుపోయినవో, యధ్యయన మేనేలఁ గలసినదో, యాతనికిఁ దెలిసినది కాదు. ఆతనికి వృషలియే సర్వప్రపంచము. వృషలియే జీవనాధారము. వృషలియే మోక్షసాధనము. వృషలియే సర్వ కామ్యముల నొసంగు నధిష్ఠానదేవత. ఆకాంతలేకున్న నాతనికీ ప్రపంచమేలేదు. ఇట్లు వృషలియందు బద్ధానురాగుఁడై గృహస్థాశ్రమమును విసర్జించినాఁడు. బంధువులఁ దిట్టినాఁడు.

సజ్జనుల బాధలఁ బెట్టినాఁడు. దాసులుఁగొట్టినాఁడు. నిందల
కోర్చినాఁడు. పాపకార్యములకుఁ దలయొగ్గినాఁడు. గోవులను
హింసింపఁ దొడంగినాఁడు. చేయరాని కార్యములఁగూడఁ
జేయుటకుఁ బాల్పడినాఁడు. ఇప్పుడతఁడు తొల్లింటి యజా
మిళుఁడుగాఁడు. అతని చరిత్రంబు మారిపోయినది.

వృషలియం దాతనికిఁ బెక్కుమంది కుమారులు గలి
గిరి. ఇట్లు పెద్దయుఁ బ్రొద్దులు గడచునంత నజామిళునకు
ముసలితనము సంభవించుటయుఁ గొన్నిదినములకు మరణ
కాల మాసన్నమగుటయు, సంప్రాప్తము లయ్యెను. మరణ
శయ్యపైనున్నను, నాతనికిఁ బుత్త్రేషణంబు మిక్కుటముగా
నుండెను. అందువలన నాతఁడు తన చిన్నకుమారుఁడగు
నారాయణుని, వీధిలో నాడుకొనుచుండ 'నారాయణా!
నారాయణా!' యని పిలిచెను. పుత్త్రునిఁ బిలుచుటయే యైనను,
నది హరినామస్మరణ మొనర్చుటయైనది. అట్లు సుతునిఁ బిలి
చిన కొంతతడవునకే యాతఁడు మరణించెను. అప్పుడు మహా
పాపియగు నాతనిఁ గొనిపోవ యమకింకరు లరుదెంచిరి. అంత్య
కాలమున హరినామస్మరణ మొనర్చిన మహాపుణ్యాత్ముఁడని
యాతనిని వైకుంఠమునకుఁ గొనిపోవ విష్ణుదూత లరుదెంచిరి.
విష్ణుదూతలరుదెంచు లోపలనే, యమదూతలాతనిని బంధించి
యమలోకమునకుఁ గొనిపోవుచుండిరి. దానిఁ దెలిసికొని

విష్ణుదూతలు సత్వరంబున వారలకెదురు నడచి యడ్డగించిన నాఁడు 'అయ్యా! మీ రెవ్వరు? ఈతని నెక్కడికిఁ గొనిపోవు చుంటి' రని ప్రశ్నించిరి.

య.దూ—అయ్యలారా! మేము యమునిదూతలము. మా ప్రభుని యాజ్ఞ చొప్పున మహాపాపియగు నీతని నరకమునకుఁ గొనిపోవుచున్నాము. మీ రెవ్వరో తెలియఁ జెప్పుదరా?

వి.దూ—మేము విష్ణుదూతలము. మాప్రభునియాజ్ఞచొప్పున మహాపుణ్యాత్ముఁడగు నీతని వైకుంఠమునకుఁ గొని పోవవచ్చినాము. మీ రీ మహానుభావుని, మహాపాపి యని యెట్లు నిర్ణయించినారు?

య.దూ—ఓ విష్ణుదూతలారా! మీమాటలు మాకుఁ జాల వింతగానున్నవి. గోవులను జంపినవాఁడును, కుల ధర్మమును బాలింపనివాఁడును, కులకాంత నొల్లని వాఁడును, బరాంగనాసంగమాభిరతుఁడును, సాధు జనాపకారుఁడును, బంధుజన దూషణుండును, జీవ హింసా పరాయణుండును, నసత్యవాదియును, నగు వాఁడు మహాపాపిగాక, మహాపుణ్యాత్ముఁడగునా? ఇట్టి గుణము లన్నియు నీతనియందు మూర్తీభవించి

యున్నవి. మెండియు నితఁడు వృషలీమోహపరవ శుఁడై నప్పటినుండియు,

సీ॥ సముచిత శ్రుతిచర్చఁ । జర్చింపనొల్లక
సతికుచద్వయచర్చఁ । జర్చసేయుఁ
దర్కవితర్కవిచార । తర్కంబుగాదని
కలికితోఁ బ్రణయ త । ర్కంబుసేయు
స్మృతిపదవాక్య సం । గతిగాక తత్సతి
పదవాక్య సంగతి । పరఁగఁజేయు
నాటకాలంకార । నైపుణ్యముడిగి త
న్నాటకాలంకార । నాటఁదిరుగుఁ

గీ. బరఁగఁ జిరకాల మీరీతి । బాప నియతి
రమణదాసీ కుటుంబ భా । రము వహించి
యది కుటుంబిని గాఁగఁ బా । పాత్ముఁడగుచు
నశుచియును దుష్టవర్తనుఁ । డై మెలంగె.

కావున నిట్టివానిఁ దగినట్లు శిక్షించుటకై మేము గొని పోవుచున్నాము.

వి.దూ—ఓ యమదూతలారా! మీ వాక్యములెంత మాత్ర మును సమంజసములుగావు. మీరు ధర్మాధర్మముల నెట్లు నిర్ణయించెదరు ?

య.దూ—అయ్యలారా! వేదవిహితంబు లగు కర్మంబు లన్నియు ధర్మములు. వేద విహితంబులు గానివి యన్నియు నధర్మములు.

వి.దూ.—ఎట్టివారు శిక్షాపాత్రు లగుదురు ?

య.దూ.—ఎల్ల మానవులును దమతమ కర్మంబుల ననుస రించియే శిక్షలను బొందుదురు. పాపకార్యంబు లాచ రించినవారును, వారి వారి పాపంబుల ననుసరించి— ఉత్తమ—మధ్యమ—అధమ జన్మంబులకు లోనగు చుందురు. రజోగుణప్రేరితులై, యైహిక సుఖోప భోగంబులకు లోనగుచు దుష్కార్యంబుల నాచరించు వారందఱును, దమతమ జన్మంబులను నిరర్థకంబుగా నొనర్చికొని తీరనినరకబాధల ననుభవింతురు. సాత్త్విక గుణప్రధాను లగువారు పుణ్యకర్మంబుల నొనర్చి స్వర్గాది పుణ్యలోక నివాస సౌఖ్యంబులఁ గనుచు దురు. ప్రకృతి సంబంధమున నట్టివారు సుఖదుఃఖంబు లకు లోనయ్యు, శ్రీహరిచింతనంబునఁ బ్రకృతివికారం బుల నణంచుకొని యుత్తమలోకంబులఁ బొందుదురు. హరినామ స్మరణంబువలన వారి పాపంబు లన్నియు నశించి పోవును.

వి.దూ.—హరి చింతనంబు వలనఁ బాపంబులు నశించుచో, నీతని పాపములు మాత్రము నశింపలేదా?

య.దూ.—అయ్యో! అదియెట్లు ? ఈతఁడు హరినిఁ జింతింప లేదుగదా ?

వి.దూ—మరణకాలమున 'నారాయణా! నారాయణా!' యని యుచ్చరింపలేదా ?

య.దూ—అది భగవత్స్మరణ మెట్లగును? కుమారునిపైఁ గల ప్రేమచేత నాతఁ డట్లుచ్చరించెనేకాని, భగవంతుని మీఁది భక్తిచేత నాతఁ డట్లు సేయలేదుగదా ? అదికుమారునిఁ బిలచుటయగునుగాని హరిని స్మరించు టెట్లగును ?

వి.దూ—ఓ యమదూతలారా! మీరు పొరబాటు పడు చున్నారు. మీరనిన ట్లతఁడు కుమారుని నామమునే స్మరించెనని యనుకొనుఁడు. అయిన నేమి ? భగవన్నామమును భగవంతునిమీఁది ప్రేమచేతనే తల్లిదండ్రులు తమ బిడ్డలకుఁ బెట్టుచున్నారు. అట్టి ప్రేమతోఁ బెట్టిన నామమును స్మరించుటవలన భగవంతుఁడు సంతోషించుచున్నాఁడు. అందు మరణకాలమునఁ గూడ నాపేరును స్మరించుచో, నాపేరుపై నట్టివానికిఁగల ప్రేమ యద్వితీయమగుచున్నది. అట్టి యద్వితీయప్రేమ యీతనియందుఁ గాన్పించుచున్నది. కావున నాయుచ్చారంబు వలన నాతని పాపంబులన్నియు నశించినవి. హరికీర్తన ప్రభావమును వినుఁడు—

సీ. బ్రహ్మహత్యా నేక । పాపాటవుల కగ్ని
కీలలు హరినామ । కీర్తనములు
గురుతల్ప కిల్బిష । క్రూరసర్పములకుఁ
గేకులు హరినామ । కీర్తనములు
తపనీయ చౌర్య సం । తమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ । కీర్తనములు
మధుపాన కిల్బిష । మదనాగ సమితికిఁ
గసరుల్ హరినామ । కీర్తనములు

గీ. మహిత యోగోగ్రనిత్య స । మాధి విధుల
నలరు బ్రహ్మాదిసురులకు । నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య । భోగభాగ్య
ఫలదంబులు హరినామ । కీర్తనములు.

కావున శ్రీహరి చింతనంబువలన నీతని పాపంబులన్నియు నశించినవి. ఇంతియుగాక యంత్యకాలమున శ్రీహరి నామ స్మరణమనునది పూర్వపుణ్యవశమునఁగాని ప్రాప్తికిరాదు. ఇట్టి పూర్వపుణ్యము గలవానికి నరకబాధయా? ఇది యెంతమాత్రము దగదు. మీరీతనిని విడిచిపొండు.

య.దూ—అది యెట్లు? మాప్రభుని యాజ్ఞను మేము పాలింప వలదా?

వి.దూ—ఓ యమదూతలారా! మీరీతనిని విడిచిపోకున్న చో మిమ్మునను జయించి యిందుండి పాఱఁదోలెదము.

అని పల్కఁగనే యమకింకరులు మహాట్టహాసమొనర్చుచు యుద్ధమునకు సంసిద్ధులైరి. అప్పుడు విష్ణుదూతలకును, యమదూతలకును, ఘోరమైన యుద్ధము జరిగెను. అందు యమదూతలోడిపోయి ప్రాణభయమువలనఁ బాఱిపోయిరి. అట్టియెడ నజామిళుండు లబ్ధజీవుండై, వారి సంభాషణంబును వినుటవలన జ్ఞానియై, లేచి నిలువంబడి, విష్ణుదూతలఁ బెక్కువిధంబులఁ గీర్తించెను. వారును, నాతని నాశీర్వదించి తమ నెలవున కరిగిరి. అనంతర మాతఁడు సర్వసంగపరిత్యాగమొనర్చి, గంగాతీరమున సమధికనిష్ఠాగరిష్ఠుఁడై శ్రీహరిసిఁ గూర్చి తపంబొనర్చి, యోగమార్గంబున దేహంబు సాలించి విష్ణులోకంబునొందెను.

బాలకులారా! ఈ యుపాఖ్యానంబు వలన హరినామస్మరణ ప్రభావంబును దెలిసికొని మీరును హరినిఁ గీర్తింపుఁడు.



## ౫. చిత్రకేతూపాఖ్యానము.

(భాగవతపురాణాంతర్గతము.)

పూర్వము శూరసేనదేశములకుఁ జిత్రకేతుఁడను వాఁడు. చక్రవర్తియై యుండెను. అతనికిఁ బెక్కురు భార్యలుగలరు. అతని కెందును లోపమనునదిలేదు. ఐశ్వర్యంబు లెనిమిదియు నాతనికిఁ గలవు. ఇన్నింటి కనుకూలంబుగ నాతని ప్రవర్తనమా మిక్కిలి కొనియాడఁదగినది. కాని యెన్ని యున్నను లాభమేమి? ముఖ్యముగాఁ గావలసిన సంతానమే యాతనికి లేదయ్యెను. సంతానము కొఱకే యాతఁడు పెక్కురు కాంతలను బెండ్లియాడెను. కాని యొక్కరియందును నాతనికి సంతానము గలుగలేదు. అందువలన నాతనికి మనోవిచారమతిశయించెను. కాని విచారపడి యాతఁడు సేయునదేమి గలదు? ఇదేమి పౌరుషమునకు లోఁబడిన పనియా యాతఁడు తగినట్లు యత్నించుటకు? అన్నింటికిని దైవమే గలఁడని యాతఁడు మనస్సును దృఢపఱచుకొనెను. ఇట్లుండ నొకప్పుడాతని కడకు నాంగిరసుండను మహాముని యొక్కండరుదెంచెను. చిత్రకేతుండును దన యొద్ద కరుదెంచిన యాముని పుంగవుని విధివిహితముగా సత్కరించి గౌరవించెను. పూజానంతర మాంగిరసుండు చిత్రకేతునిఁ జూచి «రాజా! నీముఖ

నైఖరినిఁ బట్టిచూడ నెద్దానిఁ గూర్చియో నీవు మిక్కిలిగా విచారించుచుంటివని తెలియవచ్చుచున్నది. ఎందును లోపంబులేని నీకు విచారంబునకుఁ గారణంబేమి?' యని ప్రశ్నింపఁ జిత్రకేతుఁడు 'మహాత్మా! ఎన్ని సంపదలున్ననేమి? ఎంతటి భోగమున్ననేమి? అన్నింటికంటె ముఖ్యమైన సంతానము లేదయ్యెఁగదా? ఆ సంతానము కొఱకే నేనింతగా విచారించుచుంటిని. మునీశ్వరా! మీరైనను దీనికిఁదగిన మార్గము నాలోచించి నాయీ విచారమును బాపుఁ' డని తెలుప నాంగిరసుండును జిత్రకేతుని యెడల జాలి వహించి 'రాజా! సంతానమును గూర్చి నీ వెంతమాత్రమును విచారింపవలదు. నాక త్రృత్వమునఁ బుత్రకామేష్టి నొనర్చి చరు శేషమును నీ పెద్దభార్య కొసంగుము. ఆమెవలన నీ కొక పుత్రుఁ డుదయింపఁ గలఁడు. అతని వలన నీకు సుజ్ఞానోదయంబు గాఁగలదు. కర్తవ్యమునకుఁ గడంగు' మని నుడువఁ జిత్రకేతుండు నట్లొనర్చి చరుశేషమును దన పెద్దభార్య కొసంగెను. దాని మహిమవలన నామె గర్భమును ధరించి, నవ మాసములు సెల్లిన యనంతర మొక శుభముహూర్తంబున నొక సుపుత్రునిఁగనెను. అంతటితోఁ జిత్రకేతుని మనోవిచార మంతయు నశించెను. సుపుత్రోదయంబు వలన నాతనికిఁ బ్రకృతి యంతయు నానంద దాయకమయ్యెను.

కాలము కుటిలబుద్ధి గలది. సుఖపడువారలను జూచి యది సహించియుండలేదు. తొలుఁదొల్త నెంతటి కష్టమును గూర్చునో యంతటి సుఖమును, నెంతటి సుఖమునుగూర్చునో యంతటి కష్టలుమును, దుదను గల్గించుచుండును. ఇయ్యది కాలముయొక్క సహజమైన గుణము. చిత్రకేతున కిప్పుడు పుత్రోదయంబు వలన మితిలేని సుఖము సమకూరినది. ఇందు వలనఁ గాలమునకుఁ గనులు కుట్టినవి. పుత్రోద్భవంబు వలన నాతనికిఁ బెద్దభార్యయందు సహజానురాగము వేయిమడుంగు లినుమడింపఁ దక్కుంగల భార్యలు సహింపలేనివారై యా బాలునకు విషముపెట్టి చంపిరి. దీనివలనఁ జిత్రకేతునకుఁ దీరని దుఃఖము సంప్రాప్తమైనది. ఇప్పుడు కాలమునకు మహా నందము గలిగినది. పుత్రునిఁ గూర్చి మిక్కిలిగ విలపించు చున్న చిత్రకేతునికడ కాంగిరసుండును, నారదుండును, జను దెంచి దివ్యదృష్టివలన సర్వమును దెలిసికొని యాతనిఁ జూచి ‹ రాజా! చచ్చినవానికై యేల విచారించెదవు? జీవులకుఁ బూర్వకర్మానుగుణంబుగ సతీసుతాదుల తోడను, బంధు మిత్రాదులతోడను సమావేశము గలుగుచుండును. నదీ జలమునందుఁ బ్రవాహావశమునఁ దేలివచ్చు కఱ్ఱలు మొద లగునవి కలియుచు, విడిపోవుచుండునట్లు, జీవులును జన్మాం తర సంబంధము ననుసరించి కలియుచు, విడిపోవుచుందురు. దీనికై విచారించుట కేవల మవివేకలక్షణము. ఇట్లని మేము

చెప్పనేల? ఈబాలుఁడే చెప్పఁగలఁ 'డని పలికి యాబాలుఁ డతఁ ప్రాణము సంగ నాతండును జననీజనకులఁ జూచి 'తలి దండ్రులారా! నాకై మీ రేల దుఃఖించెదరు? మీయందును, నాయందును, సకల జీవులయందును, నాత్మ రూపంబున వెలుంగు శ్రీమన్నారాయణుం డొక్కఁడే సత్యుఁడైనవాఁడు. మిగిలిన సృష్టియంతయు ననిత్యమైనదే. ఇదివఱకు నేనెన్నో జన్మంబుల నెత్తియుంటిని. ఇప్పుడు మీకుఁ బుట్టియుంటిని. కర్మవశంబువలన నాకిందును బరమాయువులేదు. జనులకు, వావివరుసలును, సుఖదుఃఖంబులును, భోగభాగ్యంబులును, గలిమిలేములును శాశ్వతంబులు గావు. కలుగుటయుఁ దొలం గుటయు దేహధారులకు సహజంబులు. సహజంబును, గర్మా నుగుణంబును, విధి ప్రేరేపితంబులును నగువానిఁ గూర్చి విచారించుట యెంతమాత్రమును దగదు. కావున నన్నుఁ గూర్చి మీ రెంతయు వంతలపాలగుట మంచిదిగాదు. శోక మును మానుఁ' డని వాక్రుచ్చి తిరుగఁ బ్రాణములఁ బాసెను. కుమారుని వాక్యంబుల వలనఁ జిత్రకేతునకు హృదయము మారిపోయినది. సర్వప్రపంచము క్షణభంగురమని యాత నికిఁ దెలియవచ్చినది. శ్రీమన్నారాయణుం డొక్కఁడే నిత్యుఁ డని యాతనికిఁ జక్కఁగా బోధపడినది. ఆబాలుని కళేబరంబు నకు దహనాది సంస్కారంబుల నొనర్చి, నారదుని వలన

నారాయణ మంత్రోపదేశంబును బడసినవాఁడై, నాటంగోలె నిరాహారుండై శ్రీహరిం గూర్చి తపంబొనర్ప నాదేవదేవుం డును, నాతని తపంబునకు మెచ్చి, ప్రత్యక్షమై విద్యాధరులకు రాజగున ట్లనుగ్రహించుటయే గాక, యిష్టము వచ్చిన చోటికరుగు సర్వలోక దేవవిమానంబునుగూడ నాతనికిఁ బ్రసాదించెను. చిత్రకేతుఁ డంతటినుండి నానాలోకంబుల దర్శించుచుఁ గాలమును గడపుచుండెను.

చిత్రకేతుఁడట్లు నానాలోకంబుల సందర్శించుచు నొక పుడు కైలాసంబున కరిగెను. అయ్యెడ నీశ్వరుఁడు పార్వతిని తన వామాంకమున నుంచుకొని, ప్రమథ గణములతోడను, దేవముని బృందములతోడను, గొలువుదీరి యుండెను. చిత్రకేతుఁ డాసభలోఁ బ్రవేశించి, పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించినవాఁడై, యుచితాసనంబునఁ గూర్చొని, యేలకో పక్కున నవ్వెను. అచ్చటి వారందఱును, నవ్వునకుఁ గారణం బేమని యడుగ, నాతండు వారలం జూచి «ఓ సభికులారా! ఇట్టి గొప్ప సభలోఁ జేసికొన్న కాంతను దొడపైఁ గూర్చుండఁ బెట్టికొనిన మహేశ్వరునిఁజూచుట వలన నాకు నవ్వువచ్చినది. భార్యకు మారాడ వెఱచి యర్ధశరీర మొసంగుటయేగాక, మీదు మిక్కిలి పదుగురిలో నీ విధముగా భార్యను దొడపై నిడికొనుటయా? ఒకవేళ రుద్రుఁడు స్త్రీలోలుఁడై నను

రుద్రాణికైనను నియ్యది కూడనిదని తెలియ వలదా? ఇందు వలననే నేను నవ్వితి' నని ప్రత్యుత్తరమొసంగెను. శ్రీహరి భక్తుండని శివుఁ డాతని వాక్యములకుఁ గినుక వహింపలేదు. కాని పార్వతీదేవికి మాత్రము క్రోధాగ్ని నిక్కుటముగాఁ బ్రజ్వరిల్లినది. అప్పు డా దేవి యాతనిఁ జూచి 'ఓరీ! పురాణ దంపతులమని మమ్ము భావింపక, యీ విధముగా గేలిసేసితివిగాన, రక్కసుండవై, భూమియందు జన్మించెదవుగాక' యని శపించెను. అంతఁ జిత్రకేతుఁ డాతల్లినిఁ జూచి 'తల్లీ! నీ శాపంబునకు నేనెంతమాత్రమును విచారపడను. ఉన్నదియున్నట్లు వలికిన మానవులకేగాక, దేవతలకేగాక, తుదకుఁ బురాణ పురుషులకుఁ గూడఁ బనికిరాదని నీ వొక పాఠమును బ్రపంచమునకు బోధించితివి. జననీ! అదియేనాకుఁ బదివేలు. శివు నంత వానిని జేపట్టిన నీవే, యిట్లు కోపమును వహింప, నింక మానవులం గూర్చి వేఱ చెప్పవలయునా?' యని వలికినవాఁడై యప్పుడే పుడమియందు వృత్రాసురుండను పేర రక్కసుండై పుట్టి వృద్ధి నొందుచుండెను.

వృత్రుఁడు రాక్షసాంశమునఁ బుట్టిన వాఁడగుట వలన నతనికిఁ బూర్వ జ్ఞానమంతయు నశించినది. దానితోఁ బాటు హరి భక్తియు నంతరించినది. ఇప్పుడతఁడు నిర్జరవైరిగాని, నిర్జరప్రియుఁడు గాఁడు. ఇప్పుడతఁడు లోకాపకారుఁడుగాని,

లోకోపకారుఁడుగాఁడు. ఇప్పు డతఁడు విషయలంపటుఁడు గాని, విషయవిపరీతుండు గాఁడు. ఇప్పుడతఁ డజ్ఞానిగాని, సుజ్ఞానిగాఁడు: ఇప్పుడతఁడు రక్కసుండుగాని, మానవుండు గాఁడు. కాలక్రమంబునఁ బెరిగి పెద్దవాఁడై, దేవాసుర యుద్ధంబునఁ జావగా మిగిలియున్న దైత్యుల నందఱిని గుమి గూర్చుకొని, నాయకుండై, వృత్రుఁడు దేవలోకమును ముట్ట డించెను. వృత్రుఁడు సామాన్యుఁడు గాఁడు. అతని పరాక్ర మంబు మొదలు దేవతల పరాక్రమంబు కాసుకుఁ గొఱగాదు. అట్లతఁడు దేవ లోకమును ముట్టడించినంతనే, యింద్రుని నాయకత్వంబున దేవతలందఱును, నాతనితోఁ గొంతవడి యుద్ధ మొనర్చి, యాతనిని గెలువఁ జాలనివారై, పురం బును విడిచి యరణ్యములకుఁ బాఱిపోయిరి. వృత్రుఁడట్లు బృందారకపట్టణంబు నాక్రమించినది మొదలుకొని, మఱింత క్రూరుఁడై, మునులను, బ్రాహ్మణులను, గోవులను, స్త్రీలను సివుల బాధింపఁ దొడంగెను. యజ్ఞములఁ జేయువారిని, హవిర్భాగములఁ దనకీయవలసినదనియు, నధ్వరంబులఁ దన పేర నొనర్పవలసినదనియు, బలాత్కరించుచుండెడి వాఁడు. వారు వినకున్నచో యజ్ఞములఁ బాడుచేసి, యజ్ఞాధికారులఁ బెక్కువిధముల హింసించుచుండెడివాఁడు. ఒక్కమర్త్యలోక మేగాక, దేవలోకంబుగూడ, వృత్రునిఁగూర్చి మిక్కిలిభయ

పడఁ జొచ్చెను. ఇట్లు పెద్దయుం బ్రొద్దులు సనిన యనంతరము దేవతలందఱు నొక్కచోటికిఁ జేరి, దైత్యనాథుని బాధలఁ గూర్చి యనేకవిధములఁ జెప్పికొనుచుఁ బ్రతీకారమొనర్చుటకుఁ జేతగానివారలై, యింద్రునితోఁ గలసి సత్యలోకంబున కరిగిరి. సత్యలోకాధినాథుండగు బ్రహ్మ తన యొద్ద కరుదెంచిన దేవతలఁగని «ఓ యింద్రాది దేవతలారా! ఎందుండి యిటకువచ్చితిరి? మీకందఱికిఁ గుశలమా? ' యని ప్రశ్నించెను. వారును దమకు వృత్రునివలనఁ గలుగు సిలుగులఁగూర్చి పితామహునకుఁ దెలియఁజేసి, కాపాడవలసినదని ప్రార్థింప నతండును «దేవతలారా! వృత్రుఁడు సామాన్యుఁడుగాఁడు. అతనికింత బలంబు పూర్వసుకృతంబు వలన లభించినది. ఇట్టి వానిఁజంపుటయన సామాన్యమైన పనిగాదు. ఆతనికి లోహనిర్మితంబులగు నాయుధాదుల చేతఁగాని, మంత్రప్రయుక్తంబులగు నస్త్రంబులచేతఁగాని, చావులేదు. ఆతనిఁ జంపుటకెముకవలన నేర్పరుపఁబడిన యాయుధంబొండు గావలయు. అదియును సామాన్యులదియైన నిష్ప్రయోజనము. అతులిత తపఃప్రభావసంపన్నుండగు నొకసంయమీశ్వరునిదై యుండవలయును. అట్టిది లభించినచో దాని వలన వృత్రుఁడు తప్పక మరణించును. కావున నిందు కొకయుపాయమును చెప్పెదను. వినుండు. దధీచిమహాముని లోకోప

కారమునకుఁ బ్రాణములనైన ధారవోయునంతటి యుదార హృదయము గలవాఁడు. అతఁ డనుపమానతపోబలయుతుండు గాని సామాన్యుఁడు గాఁడు. మీరందఱాతని యొద్దకరిగి, మీకును, లోకములకును, వృత్రునివలనఁ గలుగుచున్న కష్టములఁగూర్చి విన్నవించుకొని, లోకోపకారార్థమై, 'మీవెన్నముక నీయవలసిన' దని యాతనిఁ బ్రార్థింపుఁడు. అతండును మీరడిగిన వెంటనే తన దేహమును జాలించి,యద్దానినొసఁగఁ గలఁడు. దానివలన మీకష్టములు నశించును. లోకములకు బాధలు దొలంగును. వృత్రుఁడు మరణించును. ఇంద్రా! దీనివలన బ్రహ్మహత్యా మహాపాతకము లభించునని భయపడకుము. హితము నుపదేశించువాఁడు నేనుగాన దానివలన నెట్టిపాపము గల్గినను భరించువాఁడను నేనే. కావున సంశయింపక మీరందఱిప్పుడే యాయనకడకుఁ బొండు. సర్వము సమకూరు' నని తెలుప వారందఱును ధైర్యము నవలంబించి యప్పుడే దధీచిమహాముని యాశ్రమంబున కరిగిరి.

ఇంద్రాదిదేవతలు దధీచిమహాముని యాశ్రమంబున కరుగునప్పటి కాతఁ డప్పుడే సమాధినుండి లేచి యతిథుల కొఱ కెదురుసూచుచుండెను. దేవతలను జూచి నంతనే యాతనికి బ్రహ్మానందము గలిగెను. వారలఁజూచి యతఁడు 'దేవతలారా! మీకుఁ గుశలమా? మీ రేదో కార్యార్థమై

యిట కరుదెంచియుంటిరని మీ ముఖవైఖరి తెలుపుచున్నది. మీరు వచ్చినపని యెట్టిదో సంశయింపక తెలియఁజేయుఁడు. అది యెట్టిదైనను నేను దప్పక నెఱవేర్తు నని పలికెను.

దేవ—మునిసార్వభౌమా! శత్రుభయముచే బ్రహ్మపంపున మేమిట కరుదెంచితిమి. మీరు మమ్మును రక్షింప వలయును.

దధీ—అయ్యలారా! ఇదిగో రక్షించెదనని యభయప్రదాన మొసంగుచున్న వాఁడను. మీపని యెట్టిదో సత్వరం బుగఁ దెలియఁ జేయుఁడు.

దేవ—లోకకంటకుఁడగు వృత్రునిఁగూర్చి మీరు వినియే యుందురు.

దధీ—అవును. అతఁడు మహాక్రూరుఁడు. మిక్కిలి బలవంతుఁడు. ఆతని దుశ్చేష్టితంబులవలన లోకంబులన్నియుఁ దల్లడిల్లి పోవుచున్నవి.

దేవ—మేమాతని బాధలకుఁ దాళఁజాలక బ్రహ్మదేవుని కడ కరిగి మొఱవెట్టుకొనఁగా నాయన మమ్మందఱిసి మీయొద్ద కంపినాఁడు.

దధీ—ఓ యనిమిషులారా! మీవచ్చిన కార్యమును గూర్చి తెలుపక జాగుసేసెద రేల? మిమ్మును నేను రక్షింప నంటినా?

దేవ—మునీంద్రా! ఆతని కాయుధంబులవలనఁ గాని, యస్త్ర శస్త్రంబులవలనఁ గాని, చావులేదట. మీావెన్నెముక వలన నాతఁడు మృతినొందునట.

ఋషి—దీనిఁజెప్పుటకేనా మీారిట్లు వెనుక ముందాడుట? దేవతలారా! ఒకని వలన సమస్తలోకములు రక్షింపఁబడ నున్నప్పు డట్టివాని ప్రాణములు పోయిననేమి? ఆతని శరీర పుడమిపై నెంతకాలము నిలిచి యుండునో యొక్కింత విచారింపుఁడు. ఈ దేహమేమి శాశ్వతమా? ఇప్పుడు గాకున్న నెప్పుడో యొకప్పుడైనను నశించునదేగదా? కావున మీాకోరిక నెఱవేర్చెదను. ందే యుండుఁడు.

అని చెప్పి యాఋషీశ్వరుఁ డాశ్రమంబులోని కరిగి తన భార్యకు సర్వమును దెలియఁజేసి, యిది లోకోపకార కృత్యంబుగానఁ దన్నుఁగూర్చి విలపింపవలదనియుఁ, దాను దేహమును జాలించిన యనంతరమామె తన్నుఁ గలిసికొన వలయుననియుఁ దెలిపి యోగమార్గంబున దేహంబును జాలించెను. అంత నతని భార్యయగు సువర్చలయుఁ బాతివ్రత్య ప్రభావంబువలన భర్తను గలిసికొనెను. తదనంతర మింద్రుఁడు దధీచి మహాముని వెన్నెముకను వజ్రాయుధంబుగను, దల యెముకను బ్రహ్మశిరోనామకాస్త్రంబుగను గొని, మించి

వహాఁడై దేవతలతోఁ గలిసి యప్పుడే వృత్రుని మీఁదికరిగెను. ఆహా! దధీచిమహాముని దాతృత్వమిట్టిదని యెవ్వరు వర్ణింపఁగలరు?

ఇంద్రుఁడు దేవతలతో దండెత్తి వచ్చినాఁడని విన్నంతనే, వృత్రుండును దానవ సైన్యంబులఁ గూర్చుకొని యుద్ధమునకు సంసిద్ధుఁడయ్యెను. కార్యక్రమంబును దెల్పుటకు దానవుల పక్షమున భార్గవుండును, దేవతల పక్షమున బృహస్పతియును నిలిచియుండిరి. యుద్ధమారంభమయ్యెను. ఆరంభమైన తోడనే ఘోరమయ్యెను. ఘోరమగుటవలన భయంకరమయ్యెను. భయంకర మగుటవలన రణరంగమంతయు రక్తాంకితమయ్యెను. ఇటు దైత్యులు లెక్కకు మిక్కిలిగఁ గూలుచుండిరి. అటు దేవతలు క్షతగాత్రులగుచుండిరి. వృత్రుని సైన్యాధిపతియగు నముచియను నాతఁడష్టదిక్పాలకుల మార్కొని యొక్కొక్కని రణవిముఖునిగాఁ జేయుచుండెను. అందువలన దేవతలు నిలువఁజాలక పరుగిడఁదొడంగిరి. పరుగెత్తువారిని వెంబడించి దానవులు పెక్కువిధముల హింసింపసాగిరి. అదిగని వృత్రుఁడు సింహనాద మొనర్చెను. అప్పుడు వాసవుఁడు తన వారికగుచున్న భంగపాటును గమనించి, రెట్టించిన కోపంబున బ్రహ్మశిరోనామకంబును నముచిపైఁ బ్రయోగింప నది యాతని పంచప్రాణములఁ గొనెను. నముచి

మడియుటతోడనే దేవతలొక్కమారుగా దైత్యసైన్యము లపై విజృంభించిరి. తమ నాయకుఁడు పడిపోవుటవలనను, దేవతలొక్కుమ్మడి తమపైఁ గవియుటవలనను, రక్కసు లాధైర్యపడి, పిక్కబలంబును జూపి, యెక్కడి వారక్కడఁ బరుగిడఁ దొడంగిరి. అప్పుడు వృత్రుఁడు తీవ్రోత్సాహమునర్చుచు సైన్యంబులఁ బురికొల్పికొని, దేవతలపై విజృంభించెను. వృత్రుఁడు విజృంభించినంతనే దేవతలు వెనుదీసిరి. ఇట్లుండి దిందుఁడాలస్య మొనర్పక దధీచివెన్నెకముగొని, వృత్రునిఁ దాకెను. ఇంతలోఁ జీకటిపడెను. రాత్రి యుద్ధము నిశాచరులకు మిక్కిలి యనుకూలమగుటవలన రక్కసులుక్కుమిగిలి పెక్కురూపంబులఁదాల్చి పెక్కుమార్గంబుల ననిమిషులను జీకాకుపఱచుచుండిరి. ఇది యిట్లుండ వృత్రుండు భయంకరాకారంబును దాల్చి, యిందుని గూఱుక్కున మ్రింగివైచెను. దానితో రక్కసుల జయధ్వానములును, దేవతల రోదనధ్వానములును దిక్కుల మారుమ్రోత లీనఁదొడంగెను. అప్పుడమరులందఱును బృహస్పతినిఁ జూచి యేదిమార్గమని విలపింప నాతఁడేమియుఁదోచక మిన్నకుండెను. అట్టి సమయమున దేవ లాశ్చర్యచకితులగునట్లు దానవులయందు హాహాకారములు మిక్కుటములయ్యెను. ఏమాయని చూచునప్పటి కిందుఁడు వెన్నెముకాయుధంబువలన వృత్రుని కడుపుచీల్చుకొని వెలికి

వచ్చుటయు, దానివలన లోకకంటకుండగు వృత్రుఁడు మృతుండగుటయుఁ గననయ్యెను. ఇంకఁ జెప్పనదేమున్నది? దేవతలు జయలక్ష్మితోఁబాటు రాజ్యలక్ష్మినిఁగూడఁ గొనిరి. దైత్యులు తమ నాయకునితోఁబాటు నాకాధిపత్యమును గూడఁ గోలుపోయి తలకొకదిక్కున నెందేనియుఁ జనిరి. లోకసంరక్షణ మొనర్పఁబడెను.

బాలకులారా! 'పరోపకారార్థ మిదం శరీర' మను నార్యోక్తిని గుఱుతించి, మనము మన ప్రాణముల సర్పించి యేని లోకమున కుపకార మొనర్పవలెను. దానివలనఁగలుగు కీర్తివలన మనము చనిపోయినప్పటికిని, మన పేరు పుడమిపై శాశ్వతముగా నిలిచియే యుండును. ప్రతివారును మనలఁ గూర్చి ముచ్చటించుచునే యుందురు.



# ౬. కుచేలోపాఖ్యానము.

(భాగవతపురాణాంతర్గతము.)

పూర్వము కుచేలుఁడను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు కడుంగడు దరిద్రుఁడు.ఆయన భార్య పేరు వామాక్షి. అతనికి ధనలోప మున్నదన్నమాటయేగాని సంతానలోప మెంతమాత్రమును లేదు. తగినంతద్రవ్యము లేకపోవుటవలన నాతనికిఁ గుటుంబ పోషణము దుస్తరమయ్యెను. కేవలము బిచ్చమెత్తుకొని జీవించుచుండెడివాఁడు. కాని యెన్నినాళ్ళని యీవిధముగాఁ గుటుంబమును పోషింపఁ గలఁడు? కష్టము లెక్కుడైన కొలంది కుచేలునకు మనోధైర్య మధికము గాఁజొచ్చెను. అతఁడు ప్రకృతి సంబంధంబు వలన సంసార పరుఁడేగాని, హృదయసంబంధంబువలన నిక్కముగ హరిభక్తి పరుఁడు. కుచేలుఁ డెల్లప్పుడు శ్రీహరినామస్మరణంబును దవిలి యుండెడివాఁడు. దారిద్రదుఃఖము ననుభవించువాఁడయ్యెను, భగవంతుని దూషించెడివాఁడు గాఁడు. పూర్వకృత కర్మంబు ననుసరించి యెల్లజీవులకు సుఖదుఃఖంబులు సంభవించుచుండునని, యాతఁడు తలంచుచుండెడివాఁడు. అతని భార్యయగు వామాక్షియు, నన్ని విధముల నతనికిఁ దగినదే. ధనముకొఱకు భర్తను బీడించెడిదిగాదు.సంపదలు లేకపోయెఁ

గదాయని వాపోయెడిదిగాదు. ఉన్నంతలోనే సంసార
మును గుట్టుచక్కగా జరుపు కొనెడిదిగాని, యిరుగు పొరుగు
వారితోఁ జెప్పుకొని కుటుంబమును వెలితి జేసికొనెడిది గాదు.
సంసార పక్షమున నిట్లుండుటయే గాక, భర్తృపక్షమునఁ
గూడ మిక్కిలి భక్తిగలిగి యుండెడిది. పతియే దైవమని
యామె యెల్లప్పుడుఁ దన మనోనాథునిఁ బూజించుచుండె
డిది. భర్తమనస్సునకుఁ గష్టమగు పనిని నొనర్చి యెఱుంగదు.
తన్నెన్ని యన్నను మారువలికి యెఱుంగదు. ఇట్టి కులకాంత
యగుట వలననే, కుచేలునకుఁ గుటుంబపోషణ మంతకష్ట
ముగాలేదు. దాంపత్యమన నిట్లగదా యుండవలసినది?

ప్రపంచమున మాతృప్రేమకన్న నుత్కృష్టమైనది
వేఱొండులేదు. వామాక్షి కుటంబముయొక్క దుస్థితి కెంత
సహించియున్నను, బిడ్డలు పడుకష్టములఁ జూచినంతనే
యెంతయో దుఃఖించుచుండెడిది. ఆనాఁడు గ్రామమునఁ
గుచేలునకుఁ దగిన భిక్షము లభించినదిగాదు. అందువలనఁ
బిల్లలకుఁగూడఁ గడుపునిండఁ గూడుచిక్కినదిగాదు. పాపము!
ఆపసిబిడ్డలకుఁ గష్టసుఖములఁగూర్చి యేమి తెలియును? తమ
కన్నము దొఱికినదికాదని, యన్నమును బెట్టవలసినదని
తల్లినిఁజేరి యేడువఁదొడంగిరి. వారియేడుపును విన్నంతనే
వామాక్షి హృదయము చెదరిపోయినది. బిడ్డలతోఁబాటు

వామాక్షి గూడ నేడువఁ దొడంగినది. కాని యేడ్చినందు వలన ఫలమేమిగలదు? అంతమాత్రమున నాపసిబిడ్డల యాకలి దీరునా? కుచేలుఁడు మనోధైర్యము గలవాఁడగుటవలనఁ దన దుఃఖమును బైకిమాత్రము చూపక లోలోపలనే యణచుకొనుచుండెను. అతనికిఁగూడ బిడ్డల యేడ్పును విన్నంతనే, హృదయము చెదరిపోయినది. వామాక్షి పొరలి పొరలివచ్చు శోకము నాపుకొనఁజాలక, నిజనాథునిఁ జేరంజని "నాథా! అన్నముకొఱకు బిడ్డలేడ్చుచున్నారు. నేనేమి సేయుదును? వారల యేడ్పు నెట్లుమాన్పుదును? ఎన్నినాళ్లకు మనమీకష్ట దశ ననుభవింపగలము? అయ్యో! ప్రతిదినము నిట్లేయగుచో నీపసికందులు జీవించు టెట్లు? వీరింక మనవారుగారు. నాథా! నాథా! నాబిడ్డలను జూచిన నాకడుపు పగిలిపోవుచున్నది. నానాటికి శల్యాకృతిని వహించుచున్నారు. ప్రాణములను గన్నులలోఁ బెట్టుకొని యున్నారు. ఉపేక్షించినచో మనకుదక్కరు. దారిద్ర్య శోకముతోఁ బాటు, పుత్రశోకమును గూడ ననుభవింప వలసి వచ్చునేమో? అయ్యో! ఆసంగతి తలంపునకు వచ్చినంతనే నాపంచప్రాణము లెగిరి పోవుచున్నవి. మనోహరా! దీనికేదైన మార్గమును విచారింపుఁడు. ఎన్ని కష్టములకైనను మనమోర్వఁ గలముగాని, పసిబిడ్డలోర్వఁ గలరా?" యని పెద్దపెట్టున విలపింపఁ దొడంగెను. అప్పుడు

కుచేలుఁడును బొంగివచ్చుచున్న శోకప్రవాహము నణంచు
కొని, భార్యనుజూచి, ‹పిచ్చిదానా ! ఏల యిట్లు వాపోయెదవు?
మన కర్మమిట్లుండ నేడ్చుటవలన ఫలమేమి ? కానిమ్ము, ఎల్ల
ప్పుడు కష్టములేయుండునా ? దైవము తప్పఁజూచు నప్పుడు,
పౌరుషమెట్లు పనిసేయ గలదు ? ఎఱిఁగి మన మొకరి కపకార
మొనర్చి యుండలేదు. ఇంతటి కష్టదశ ననుభవించుచుండియు
భగవంతుని దూషించి యెఱుంగము. ఎల్లప్పు డాతనినే
నమ్మి త్రికరణశుద్ధిగా భజించుచుంటిమి. ఇట్టి తనవారల
నాతఁ డెప్పుడో రక్షించియుండును గాని మనకర్మ మిట్లుండ
నాతఁడు మాత్రమేమి సేయఁగలఁడు? ఎంతటివారికిని గర్మాను
భవంబుదప్పదుగదా!' యని వాక్రుచ్చెను. కాని వామాక్షి
కాతని వాక్యములు నచ్చినవిగావు. అప్పుడామె తనభర్తను
జూచి ‹మనోహరా! ఇట్లని యెంతకాల మోర్చియుండఁ
గలము? పౌరుష మొనర్చికదా దైవముపై నాధారపడునది?
కావున నేఁజెప్పుదాని నించుక యాలకింపుఁడు. శ్రీకృష్ణ భగ
వానుఁడు మీకు బాల్యస్నేహితుఁడుగదా! ఆ మహానుభావుఁ
డిప్పుడు ద్వారకాపురంబున నున్నవాఁడు. ఆతఁడు భక్తవత్స
లుఁడు. తన్ను నమ్మి నిశ్చలభక్తితో భజించువారలకుఁ
దన్నైన నిచ్చునంతటి యుదారహృదయుఁడు. ఆతఁడా సకల
సంపదలతోఁ దులదూగుచున్నవాఁడు. ఆమహాత్ముని నంద

ర్శన మిహపరంబులకు శుభకరము. కావున మీరాతనియొద్ద కరుగుఁడు. సర్వజ్ఞుఁడగు నాతనికి మీదుస్థితి తెలియక పోదు. భక్తవత్సలుండగు నాతఁడు భక్తుండని యెన్నకపోయినను, దుదకు బాల్యస్నేహితుండని తలంచియైన మీకు సాయ మొనర్పఁగలఁడు. ఆలక్ష్మీనాథుఁడు గరుణించినచో మనకు సర్వసంపదలు సమకూరఁగల' వని తెలుపఁ గుచేలుండును సమ్మతించినవాఁడై భార్యను విలోకించి 'కాంతా!నీవు చెప్పిన చొప్పున నామిత్రుని సందర్శనార్థమై నేఁడే యరిగెదను. కాని—

క. పతికడకుఁ దన్నుఁ గూర్చిన
సతికడకును వేల్పుకడకు । సద్గురు కడకున్
సుతుకడకు రిక్తచేతుల
ను 'మతిహితులు సనరు నీతి । మార్గము...'

అని పెద్దలు చెప్పుదురు గాన నాకేమైన నొసంగుము. పోయి వచ్చెద' నని పలికెను. అంత వామాక్షియు నెన్ని నాళ్ళ నుండియో దాచియుంచుటవలనఁ దుబ్బులు గట్టియున్న చేరెఁ డటుకులను మగని జీర్ణవస్త్రంబు కొంగున నంటఁగట్టి పయన మొనర్చెను. కుచేలుండును నాఁడే ద్వారకానగరంబునకు బయలుదేరెను.

కుచేలుఁడట్లు ద్వారకాపురంబున కరుగుచుఁ దనలోఁ దాను 'నేనెంత పిచ్చివాఁడను? సతిహితమును బాటించి యిట్లు బయలుదేరితినే గాని, నేనెక్కడ? ద్వారకాపుర మెక్కడ? ఎట్టెటులో ద్వారకానగరంబును జేరుదు ననుకొందుఁ బో! ఎట్టెటులో నాపురంబును బ్రవేశింతు నను కొందుఁ బో! ఎట్టెటులో నామహానుభావుని దివ్య సౌధమునఁ గూడ సమీపింతు ననుకొందుఁబో! ఇంత మాత్రమున నేమి సిద్ధింపఁ గలదు? ప్రయోజనంబులేని శ్రమకు లోనగుటయేగదా? నిరుపేదనగు నే నేడ? అష్టైశ్వర్యసంపన్నుండును, భాసురాంత. పురవాసియునగు శ్రీకృష్ణుఁడెక్కడ? అతనియంత పురంబును బ్రవేశింతమన్న నన్నచటి ద్వారపాలకులడ్డగింతు రేమో? నిరుపేదననియు,మలినవస్త్రధారిననియు, నన్ను వారు కసిరికొట్టుదు రేమో? ఒక వేళ వారికేమైన లంచమిచ్చి లోనికరుగుఁ మన్నఁ జేతఁ జిల్లిగవ్వయైనను లేనివాఁడనుగదా? ఆ! ఇది యంతయు వెఱ్ఱియాలోచనగాని భక్తవత్సలుండగు శ్రీకృష్ణుఁడు నన్నుఁ గరుణింపకుండునా? అతని సేవకులు మాత్రము నా యందు జాలి వహింపకుందురా? ఏమో? భవిష్యద్విధాన మునుగూర్చి నిర్ణయించుటెట్లు? శ్రీకృష్ణుఁడు దయాసముద్రుఁ డనియు, భక్తసులభుండనియు, వినియున్నాను. ఐనను నా భాగ్యమెట్లున్నదో?' యని యనేకవిధములఁ దలపోసికొనుచు

గతిపయ దివసంబులకు ద్వారకాపురంబును జేరెను. ఆ నగర శోభాతిరేకంబును గన్నులారఁ దిలకించినంతనే కుచేలునకు బ్రహ్మానందము గలిగెను. ఏ గృహమునఁ జూచినను లక్ష్మి తాండవమాడుచుండెను. ఏమందిరమును దిలకించినను, శ్రీహరి పూజలతో నిండియుండెను. ఏద్వారమును వీక్షించినను బచ్చని మామిడితోరణములతో భాసిల్లుచుండెను. ఏయమ్మను గాంచినను మణిమయభూషణాదులతోఁ గళకళ లాడుచుండెను. ఏ పురుషుని విలోకించినను హరిసేవాపరాయణత్వమున సార్థక జన్ముఁడై విలసిల్లుచుండెను. అట్టి పురమును జక్కఁగాఁ దిలకించుచుఁ గుచేలుఁడు కృష్ణుని దివ్యసౌధంబును సమీపించి, యెవ్వరిచేతను నడ్డగింపఁ బడక, యథేచ్ఛగా నంతఃపురంబును బ్రవేశించెను. సజ్జనుల నడ్డగించు వారెవ్వరుందురు ?

కుచేలుఁ డట్లంతఃపురంబును బ్రవేశించి యెట్టయెదుట రుక్మిణీసౌధమున బహు వినోదముల మునింగియున్న వానిని, మన్మథ మన్మథుం డనఁగ నొప్పువానిని, నీలమేఘమువంటి శరీరకాంతి గలవానిని, దేవేంద్రాది దేవతలచేత నుతింపఁబడెడు వానిని, కౌస్తుభమను భూషణమును ధరించినవానిని, సర్వాభీష్టముల నొసంగువానిని, సురుచిర రూపలావణ్యాతిశయంబు గలవానిని, దేవతలకు శరణ్యుఁడైన వానిని, సింహము నడుమువంటి నడుము గలవానిని, సకల లోకముల

చేత నారాధింపఁ బడెడువానిని, హస్తమునఁ జక్రాయుధం బును గలవానిని, జగత్ప్రశస్తుఁడైన వానిని, విహఁగవల్లభుని వాహనముగాఁ గలవానిని, బట్టువస్త్రమును ధరించినవానిని, శ్రీపతియైయిూఁదఁ బవ్వళించువానిని, గమలములవంటి కన్నులు గలవానిని, మకరకుండలాలంకారములచేత శోభిల్లువానిని, మృదుభాషణ మొనర్చువానిని, నాదిమధ్యాంతములు లేని యాకారము గలవానిని, క్షీరసాగరమందు విహరించువానిని, సకల సద్గుణములకు నిలయమై నెగడొందువానిని, సృష్టి స్థితి లయంబులకు నాథుఁడైనవానిని, జతుర్దశభువనంబులను గుక్షి యందు దాచియుంచినవానిని, బ్రహ్మాదులకుఁ గూడ నంద రానివానిని, సకల జీవులయందును సూక్ష్మరూపంబున నిలిచి యున్నవానిని, సర్వస్థలంబులందును వ్యాపించియున్నవానిని, సాకారుఁడయ్యు నిరాకారుఁడై వెలయువానిని, విశేషుఁ డయ్యు నిర్విశేషుఁడై యొప్పువానిని, హ్రస్వదీర్ఘస్థూల సూక్ష్మానందప్రవాహమునకు మూలమైనవానిని, వేసము లేనివాఁడయ్యుఁ బదివేషంబులఁ దాల్చువానిని, బ్రాణవస్వరూ పుఁడయ్యుఁ బ్రాణాతీతుఁడగువానిని, బ్రకృతి సంబంధము గలవాఁడయ్యుఁ బ్రకృతివికారములు లేకుండ నెగడువానిని, యదుకులంబున నవతరించినవానిని, శ్రీకృష్ణభగవానునిఁ గని భక్తిభావం బినుమడింప డాయుంజని తత్పాదగతులఁ బ్రార్థింపఁ

దొడంగెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు తత్తరముతోఁ దల్పంబు నుండి డిగ్గి, యెదుర్కొని, పరిరంభణమాచరించి, కుచేలుని నుచితాసనమునఁ గూర్చుండఁజేసెను. అట్టియెడ రుక్మిణీదేవి కనకకలశంబులతో నిర్మలోదకంబులఁ గొనివచ్చుడు శ్రీకృష్ణ పరమాత్ముఁ డాభూసురోత్తముని పాదంబులఁగడిగి, తడియొత్తి పూజఁగావించెను. అక్కడనున్న పరిచారికాజనంబు లంద ఱాతనిఁజేరి యొకరు గంధమునుబూయ, నింకొకరు సిగఁబూల ముడిచిరి. ఒకరు కుసుమదామములఁ గంఠమునవేయ, నింకొ కరు ఫలాహార మొసంగిరి. ఒకరు కర్పూరతాంబూలంబు నొసంగ, నింకొకరు పునుఁగుజవ్వాదివిలేపనంబుల మేన నలం దిరి. ఇట్లు పరిచారికాజనంబు లుపచరించుచుండ శ్రీకృ ష్ణుఁడు పాదముల నొత్తుచుండెను. మార్గాయాసంబు దీరు నట్లు రుక్మిణీదేవి విసరుచుండెను. ఆహా! ఏమి కుచేలుని భాగ్యము? ఎవ్వనిసందర్శనంబు కొఱకు మునులు నిరాహారులై పెక్కేండ్లు తపంబు సల్పుదురో, యెవ్వని గుర్తింప నేరక బ్రహ్మాదులు తలఁకిందులగుచుందురో, యెవ్వని గుణంబుల వర్ణింపలేక నిగమంబులు నాల్గును ఘోషించుచున్నవో, యట్టి పురాణపురుషుని—అట్టిదేవదేవుని—అట్టిశ్రీకృష్ణభగ వానుని—దర్శించుటయేగాక, యాతని సేవలఁగూడఁ గొను చుండెఁగదా? ఆహా! 'నాదాసులకు నేను దాసుఁడ' ననుశ్రీ కృష్ణభగవానుని వాక్యము సర్వవిధముల సార్థకంబేగదా?

కుశల ప్రశ్నము, సత్కారము ముగిసిన యనంతరము, కృష్ణుఁడు కుచేలునితోఁ గొంతతడవు తమ బాల్య క్రీడలఁగూర్చి ముచ్చటించి, తదనంతరము దివ్యదృష్టివలనఁ దనసఖుఁడు తన యొద్ద కరుదెంచిన వృత్తాంతమును దెలిసికొని, 'మిత్రమా! నీవు నాచెంత కరుదెంచు నప్పుడు నాకని యేమి తెచ్చియుంటివి? అయ్యది యెట్టిదైనను నేనారగింతును. నాతత్త్వము నీకు మాత్రము దెలియదా?

'క. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను తోయమైనఁ బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.'

కావున నీవు నా కొఱకుఁ దెచ్చిన దానిని సంశయింపక కొసంగు' మని పలుకఁ గుచేలుఁడు దాఁదెచ్చిన యటుకుల నంతటివాని కొసంగఁజాలక మౌనము వహించెను. కృష్ణుఁ డా సమాచారమును గూడఁ దెలిసికొని 'కుచేలా! ఏల సంకోచించెద'వని పలుకుచు నాతని జీర్ణవసనంబు కొంగుననున్న యటుకులమూటను విప్పి, పిడికె డటుకులను బ్రీతి పూర్వకంబుగ నారగించి మఱియొక పిడికెడుగొన రుక్మిణి యాతని హస్తమును బట్టుకొని 'నాథా! ఇంకవలదు. ఇప్పటికే నీ మిత్రున కెన్నరాని సంపదలు గల్గినవి. మితిమీరుట యెన్నటికిని బనికిరా' దని వారించెను.

మఱునాఁడు కుచేలుఁడు తన మిత్రుని యొద్ద సెలవు గైకొని, తన యూరునకుఁ బ్రయాణమయ్యెను. కృష్ణుండును, గుచేలునిఁ గొంతదూరమువఱకనిపి సెలవుగైకొనెను. కృష్ణుఁ డరిగిన యనంతరము, తన కేమియు నాతఁడొసంగక పోయెఁ గదాయని కుచేలుఁడు పెక్కు విధంబులఁ దలంచుచు ననవరత ప్రయాణం బొనర్చి తనపురంబును జేరెను. కాని యాపుర మును జూచినంతనే యాతనికి మతిభ్రమణము గల్గెను. అది ద్వారకానగరంబువలె నుండెనుగాని, యిదివఱ కాతని పురంబువలె నుండలేదు. ఎక్కడఁ జూచినను మేడలే, ఎక్కడఁ జూచినను లక్ష్మీప్రసన్నమే, ఏమాయని విచారించుకొనుచు, గృహంబును సమీపించు నప్పటి కది శ్రీకృష్ణుని యంతఃపు రంబువలె నుండెను. దారితప్పితినా యేమని యాతఁడు తల పోయుచుండఁ బరిచారికా జనంబులతో నాతని భార్య యతని కెదురు సనుదెంచి లోనికిఁ దోడ్కొనిపోయి, శ్రీకృష్ణుని కృపావిశేషంబు వలననట్టిసంపదలులభించెనని తెలియఁజేసెను. నాఁడు మొదలాదంపతులు హరి యందెడతెగని భక్తిగల వారై సుఖముగాఁ గాలమును గడపుచుండిరి.

బాలకులారా! హరిభక్తి గలవారల కన్నియు లభించును.

---

# ౨. నరజననము.

(అష్టాదశపురాణాంతర్గతము.)

బాలకులారా! ఇంటి గుట్టును దెలిసికొనకయే, బయటి గుట్టును దెలిసికొనుటకు యత్నించునట్లు, మానవుఁడు తన జన్మమును గూర్చి తెలిసికొనకయే, యితర విషయములఁ గూర్చి తెనిసికొనుటకు యత్నించుచున్నాఁడు. ఇది ప్రపంచ స్వభావము. కావున మీకీ పురాణముల యందుఁ దెలుపఁబడిన మానవజన్మ క్రమమును గూర్చి సంగ్రహముగాఁ దెలియఁ జేసెదను. తెలిసికొనుఁడు.

## ౧. పిండోత్పత్తి క్రమము.

మనము భుజించునట్టి యోషధులయందుఁ దొలుదొల్త బీజరూపముననుండి యనంతర మందుఁగల సారము శుక్ల మగుచున్నది. అనంతర మాశుక్లము స్త్రీ గర్భమునందున్న పుష్పమునఁబడి, స్త్రీ రేతస్సుతోఁ గలసి పిండరూపమును బొందుచున్నది. ఈ పుష్పమునకు జరాయువని పేరు. ఇది స్త్రీల ఋతుకాలమున వికసించి యుండును. ఈ శుక్ల శోణితంబులు గలిసిన యైదు రోజులకు నీటిబుగ్గవలె నేర్పడుచున్నవి. పదునేను దినముల కండాకృతి నొందును. నెల రోజు

లకు లొడితెడు పెరుగును. రెండు నెలలకు మానవాకార మును బొందును. నాలుగు మాసముల కంగములను గై కొనును. అయిదు లేక యారు మాసములకు గోళ్ళు వగై రాలను, నేడు మాసములకు నెముకలు, తల, చర్మము, వెంట్రుకలు, మొదలగు వానిని బొందును. ఎనిమిదవ మాస మున సంపూర్ణ చైతన్యమును బడయును. ఇట్లు సంపూర్ణ చైతన్యమును బొందిన యా పిండము, బొడ్డు తీగద్వారా, తల్లి భుజించునట్టి, యుప్పు, పులుసు, కారము, చేదు, వగరు, మొదలగు పదార్థముల సారమును గైకొనుచు, గర్భనర కంబు ననుభవించుచు, మలమూత్రాదులకు లోనగుచు, నిట్టి గర్భనరకమును, దన కెన్నఁడును గలిగింప వలదని భగ వంతునిఁ బ్రార్థించుచుఁ దుదకుఁ బదినెలలు బూర్తియగుడుఁ దల్లిని బహు కష్టపెట్టి పుడమిపై జన్మించును.

## ౨. మానవదేహ నిర్మాణము.

పిండోత్పత్తి క్రమమును గూర్చి మీకిప్పుడు తెలియ వచ్చినదిగదా? ఇఁక మానవదేహనిర్మాణమునుగూర్చి కొంత వఱకుఁ దెలిసికొనుఁడు. మానవ దేహములు రెండువిధములు. మొదటిది వ్యావహారిక దేహము. రెండవది పారమార్థిక దేహము. వ్యావహారిక దేహమునం దేబదిలక్షల రోమ

కూపము లున్నవి. వీనిలో నేడు లక్షలు శిరస్సున నున్నవి. వ్రేళ్ళయందలి యెముక లిరువది. నోటిలోని దంతములు ముప్పదిరెండు. ఈ దేహమునందు వేయి పలముల మాంసము నూరు పలముల రక్తము, పది పలముల మేదస్సు, నూట నలుబది పలముల చర్మము, పండ్రెండు పలముల మజ్జ, మూడు పలముల మహారక్తము, పది మాషముల యెత్తు రేతస్సును, జేరియుండును. మున్నూటయరువది యెముకలు, కోటి నరములు, నుండును. ఇవిగాక యేబది పలముల పిత్తము, దానిలో సగము శ్లేష్మము గూడి యుండును. ఈ శరీరమున జీవుడు వాయు రూపమున సంచరించు చుండును. ఈ జీవునందే— అనగా, సర్వ సంపూర్ణమగు నీ దేహమునందు బదునాల్గు భువనంబులును, సప్తద్వీపములును, సప్త కులపర్వతంబులును సప్తసముద్రంబులును నిలిచి యున్నవి. అందువలననే దీనికి, బ్రహ్మాండమను పేరువచ్చినది.

ఇంక పారమార్థిక దేహమును గూర్చివినుడు. ఇది యెల్లప్పుడును స్థూలదేహమున నిమిడియుండును. ఇందు భగవంతు డాత్మరూపమున నివసించుచున్నాడు. కావుననే పురుషు డీశ్వర రూపధారి యనియు, స్త్రీ ప్రకృతి రూపిణి యనియు జెప్పబడుచున్నారు. ఈసూక్ష్మశరీరమునందారు

చక్రములున్నవి. ఇట్టి మానవదేహనిర్మాణమును గూర్చి సంపూర్ణముగా నెవ్వఁడెఱుంగునో యట్టివాఁడు మహాజ్ఞాని యగుచున్నాఁడు. అట్టి వాఁడొక్కఁడే తన జన్మమును సార్థకము జేసికొనఁ గలుగుచున్నాఁడు.

## 3. ఆరోగ్య సాధనములు.

ఈవిధముగా నేర్పడిన మన దేహమును జక్కఁగాఁ గాపాడుకొనవలయును. కాపాడుకొనుట యన నారోగ్యవంతులమై యుండుటయే. ఆరోగ్యవంతులమై యుండుటకు మనము మిక్కిలి జాగరూకతతో నుండవలయును. శరీరమునకుఁ దగిన పరిశ్రమ నీయవలెను. వేళతప్పక భుజింపవలయును. శరీరమునకు సరిపడు పదార్థములనే భుజింపవలయును. ఆభుజించుటయైనను మితముగా నుండవలయును. మనము మన కడుపును సగము అన్నము మొదలగు పదార్థములతోడను, నాల్గవ భాగమును నీటితోడను నింపి, మిగిలిన భాగమును గాలికొఱకు ఖాళీగా నుంచవలయును. భోజనము చేసిన తరువాత నాలుగు గంటలవఱకు, మఱియేపదార్థమును దినఁ గూడదు. అవసరమగు నెడల మంచినీరు మాత్రము త్రాగ వచ్చును. ఎప్పుడు నాకలితో నుండఁ గూడదు. బాగుగా నాకలి యున్నప్పుడేమియుఁ దినకున్నచోఁ బైత్యము హెచ్చి

ప్రాణమున కుపద్రవము గలుగఁజేయును. ఆకలి బాగుగాఁ గలిగినప్పుడన్నము లభింపక పోయినయెడల మంచి పాలనైనను గ్రోలవలెను. అవియు లభింపకపోవునెడలఁ దుదకుస్వచ్ఛమైన జలమునేనిఁ ద్రాగవలెను. ఎన్నఁడును మితిమీరి భుజింపఁ గూడదు. ఆరోగ్యమును గాపాడుకొనుటకు స్నానముగూడఁ దగిన సాధనమగుచున్నది. దీనికిఁ జల్లనినీరు మంచిది. అదియుఁ బారెడి నీరగుచో మఱింత మంచిది. ఇదిగాకున్న గోరువెచ్చని నీరైనను మంచిదియే. సూర్యోదయకాలమునఁ గాని, యంతకుముందుగాని స్నానము చేయవలెను. భోజనము చేసినపిమ్మట నది జీర్ణమగువఱకును స్నానము చేయఁ గూడదు. తఱచుగా నభ్యంజనస్నానమును జేయుచుండవలయును.

నిద్రయు నారోగ్యమునకు మూలసాధనమగుచున్నది. ఇది బాలురకు విశేషముగా నుండవలయును. యౌవనమందున్నవారికి రోజునకెనిమిది తొమ్మిదిగంటల నిద్ర యవసరము. ఆరుగంటలైనను వారు నిద్రపోకున్నచో నారోగ్యము చెడును. పగటినిద్ర యారోగ్యమును బాడుసేయును. వేసవికాలమునందు మాత్రము పగటివేళ రెండుగంటలసేపు నిద్రింపవచ్చును. రాత్రివేళఁ బ్రథమభాగమునందు నిద్రపోవుట మంచిది. కావుననే పెందలకడనే పరుండి, వేకువనే

లేవవలయునని మనవారు సెప్పుదురు. ఇంకను భయము వలనను, విచారమువలనను, దుఃఖమువలనను, కోపమువలనను, నారోగ్యము చెడిపోవును. ఆరోగ్యము ఋతువుల ననుసరించియుఁ గలుగుచున్నది. వసంతఋతువునందుఁ జందనాదులను బూసికొనుట, యౌవనవతులగు స్త్రీలతో సుఖంచుట, మొదలగువానిచేతను, గ్రీష్మఋతువునందు సాయంకాలము చల్లనిగాలిలోఁదిరుగుట, నియమితకాలమున నాహారమును గైకొనుట, మొదలగువానిచేతను, వర్షఋతువునందు, వెచ్చని నీళ్లతో స్నానముచేయుట, వేడిపదార్థములను గైకొనుట, మొదలగు వానిచేతను, శరదృతువునందు శరీరమున కెండ తగులకుండఁ జేసికొనుట, నూతినీళ్లతో స్నానముచేయుట, సమముగా భుజించుట, మొదలగువానిచేతను, హేమంత ఋతువునందు, నుష్ణపదార్థముల నప్పుడప్పుడు గైకొనుట, శరీరమునకుష్ణత్వమును గలిగించుకొనుట, వేడియన్నమును భుజించుట మొదలగువానిచేతను, శిశిరఋతువునందు వేడి నీళ్లతోస్నానముచేయుట, శరీరమును గప్పియుంచుట, మొదలగువానిచేతను, మంచియారోగ్యము గలుగుచున్నది. ఇంకను నెయ్యి, పాలు మొదలగు పరిశుభ్రపదార్థములను గైకొనుట చేతను, నాకలియగునప్పుడు మంచియాహారమును భుజించుట వలనను, దాహశాంతికిఁ జల్లనినీరు ద్రావుటవలనను, తాంబూ

లము వేసికొనుటచేతను, బగటిపూట నావుపెరుగుతో భుజించుటచేతను, దీపిపదార్థములను మితముగాఁగైకొనుటవలనను, నింద్రియనిగ్రహమును గలిగియుండుటవలనను, మంచియారోగ్యము గలుగుచున్నది.

ఆరోగ్యముగలుగుట కెన్నిమార్గములుగలవో, చెడిపోవుటకు నన్నిమార్గములు గలవు. సారములేని మాంసమును భుజించుట, తనకంటెఁ బెద్దవారగు స్త్రీలతో సుఖించుట, కన్యామాసమున నెండకాగుట, పులిసినపెరుగును గైకొనుట, రాత్రికాలమునఁ బెరుగు నుపయోగించుట, ఋతుమతియైయున్న కాంతతోఁగలియుట, తాటిపండు, బిల్వఫలము దిని నీరుద్రావుట, శరత్కాలమున వేడినీరుద్రావుట, భాద్రపదమాసమునఁ జేదుపదార్థములఁ గొనుట, దాహములేకుండ నీటినిగ్రోలుట, కంపునూనెను శరీరమునకుఁ బూసికొనుట, పాసిపోయిన యన్నమునుదినుట, కుళ్ళిపోయిన పండ్లనుదినుట, మాగుడువలనఁ బండిన యరటిపండ్లను దినుట, వాననీరు ద్రావుట, యింటనిలువయున్న కుంభోదకముతో స్నానము చేయుట, భోజనముచేసిన వెంటనే చాలదూరము నడచుట, నిప్పుకాచుకొనుట, విశేషముగాఁ దిరుగుట, విశేషముగా మాటలాడుట, విశేషముగా స్త్రీలతోఁ గలియుట, తలఁచుగా శోకించుట, కలహించుట, తిండిమానియుండుట, పరుష

భాషణ మొనర్చుట, మొదలగువాని యన్నిటిచేత నారో
గ్యము చెడిపోవును. కావున వీనినన్నింటిని జక్కగా గమనించి
మనము మనయారోగ్యమును గాపాడుకొనవలెను. ఆరోగ్యమే
మనకు మహాభాగ్యము.

## ౪. మానవ జీవితము.

మనమందఱమును బైనుదహరింపఁబడిన విషయముల
గ్రహించి మన యారోగ్యమును గాపాడుకొనవలయును.
మనజీవితమున నెన్నియోమార్పులు గలుగుచున్నవి. తొలు
దొల్త బాల్యావస్థను గడుపుచున్నాము. స్త్రీలకుఁగాని, పురు
షులకుఁగాని బాల్యావస్థయనునది పంద్రెండువత్సరముల వఱకుఁ
జెల్లుచున్నది. దీనినే పెద్ద లజ్ఞానావస్థయని చెప్పుదురు. ఈ
యవస్థయందు బాలురుగాని, బాలికలుగాని, చేసిన పాపపుణ్య
ములు వారిఁబొందవు. వీరొనర్చు ప్రతికార్యమునకు, దల్లి
దండ్రులే యుత్తరవాదులై యుందురు. అజ్ఞానావస్థయందున్న
వారగుటవలన వీరికిఁ బాపపుణ్యభేదము దెలియదు. తల్లి
దండ్రులే వారిని మిక్కిలి జాగరూకతతోఁ గాపాడవలయును.

బాల్యము గడచిన యనంతరము యౌవనావస్థసంభవ
మగుచున్నది. ఈయవస్థయందే స్త్రీపురుషులకు వివాహా
ములు జరుగుచున్నవి. ఇచ్చోట స్త్రీపురుషులకు జన్మాంతర

సంబంధమగు భార్యాభర్తలసంబంధ మేర్పడుచున్నది. ఈ సంబంధ మొక్క జన్మముతో నశించునది కాదు. జన్మజన్మములకిది నిలిచియుండును. కర్మవశమున భార్యగాని, భర్తగాని, ముందు మరణింపవచ్చును. ముందు మరణించువారు యమలోకమున కరిగి, పాపపుణ్యములకుఁ దగినట్లు, నరకమును గాని, స్వర్గాదిభోగములనుగాని, యనుభవించు చుందురు. అంతట రెండవవారుగూడ మృతినొంది, మొదటివారితోఁ గలియుదురు. తిరిగి పుడమిపై జన్మించి భార్యాభర్తలగుదురు. ఎప్పుడో యొకప్పుడు స్త్రీపురుషులార్జించిన విశేష పాపపుణ్యంబుల ననుసరించి యీసంబంధము తీరిపోవును. ఇది జరుగనియెడల జన్మజన్మముల కీసంబంధము శాశ్వతముగా నిలిచియుండును.

భార్యాభర్తలయందు భర్తకే పెక్కువిధులు చెప్పంబడియున్నవి. సహజముగా స్త్రీలకంటె పురుషులే యెక్కువ జ్ఞానమును గలవారు. కాని మాయారూపిణియగు స్త్రీవలనఁ బురుషుఁడు తనజ్ఞానమును గోలుపోవుచున్నాఁడు. ఇది స్త్రీయొక్క తప్పుగాదు. ఎందుకనఁగాఁ బురుషుఁడగువాఁడు తనశక్తివలన స్త్రీని లోబఱచుకొనవలయుఁగాని తానామెకు లోబడియుండఁగూడదు. లోఁబడుటయనునది పురుషుఁడవివేకియైనప్పుడుగాని, కామాంధుఁడైనప్పుడు గాని సంభవించు

చున్నది. ఇట్టిది తనకుఁగలుగకుండ బురుషుఁడు తన్నుఁ రక్షించు
కొనవలయును. ఇట్టి పురుషుఁడే పురుషుఁడనఁ జొప్పుచున్నాఁడు.
పురుషునకుఁ దనభార్యయెడల ముఖ్యముగా నడుపవలసినవి
కొన్ని విధులుగలవు. తాను దానామెను వశవర్తినిగాఁ జేసి
కొనుటయే యాతనికి ముఖ్యమైనవిధియై యున్నది. ఇట్లు చేసి
కొనుటకుఁ గొట్టుటయుఁ, దిట్టుటయు, మఱేవిధమునవైన శిక్షిం
చుటయు నెంతమాత్రమును బనికిరావు. ఆమెకు సాధకబాధ
కములఁగూర్చి తెలియఁజేసి, చక్కని విద్యాభ్యాసమును
గూడ నొసంగి, ముందుతానామెను మనస్ఫూర్తిగాఁ బ్రేమించి
దానిమూలమునఁ దన్నామె మనసారఁ బ్రేమించి దశవర్తి
నియై యుండునట్లొనర్చుకొనవలయును. ఇందు భార్యాభర్తల
యేకీభావ మత్యవసరము. వెండియు నీసంసారమొక బండి
వంటిది. ఆబండిని నడపువారు స్త్రీపురుషులే. సహజముగా
బండికిఁగట్టఁబడిన యెద్దులలో నొకటి త్రోవనునడచి, రెండ
వది ప్రక్కలకుఁగాని, వెనుకకుఁగాని, ముందునకుఁగాని, లాగి
నచో, బండియెట్లానడువదో, యట్లే స్త్రీపురుషులయందొకరి
మాట యొకరికిఁ బనికిరాకున్నచో; సంసారమునోడఁ
జక్కఁగానడువదు. కావుననే యేకీభావ మత్యవసరము. ఇంకను
కాంతలు సంభోగమునిమిత్తమే యుపయోగపడువారలని
మనము తలంపఁగూడదు. సంభోగమునందును భర్తకొన్ని

నియమములను బాలింపవలయును. ఋతుస్నాన మాచరించిన నాటనుండి పదునారు దినములవఱకే పురుషుఁడు తన కాంతయందు గృహస్థధర్మమును జఱుపవలెను. కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి, పూర్ణిమ, యమావాస్య, యేకాదశి, సంక్రమణము, మొదలగు పర్వదినములయందును, నితరములగు వ్రతదినములయందును, పురుషుఁడు కాంతను ముట్టరాదు. ఇట్టి నియమములను బాలించుటవలన స్త్రీపురుషులారోగ్యము గలవారగుటయేగాక, వారికిఁ గలుగు సంతానముగూడ నాయురారోగ్యబలాభివృద్ధి గలిగియుండును. ఇది దేశాభ్యుదయమున కన్నివిధముల మంచిది.

౫. పాపములు. వానిశిక్షలు.

మనము మనజీవితకాలము నందెన్నియో పాపములఁ జేయుచున్నాము. ఈపాపములు రెండువిధములై యున్నవి. మొదటివి మహాపాతకములు. ఇవియైదు. స్త్రీహత్య, శిశుహత్య, గోహత్య, బ్రహ్మహత్య, ఆత్మహత్య. ఈపాపములకుఁ బ్రాయశ్చిత్తమునునదిలేదు. ఇట్టి పాపముల నాచరించినవారందఱును తీరని నరకము ననుభవింతురు.

ఇఁకఁ రెండవతరగతివి సాధారణములు. సురాపానము, స్త్రీద్రవ్యాపహారణము. దేవ బ్రాహ్మణ ద్రవ్యాపహరణము,

వరాంగనాపహరణము, వరాంగనానంభోగము, విషప్రయో
గము, విషపదార్థవిక్రయము, దుర్జనసాంగత్యము, [illegible]
ప్రవర్తనము, దురాలోచనము, పరదూషణము, వేదాదా
విరుద్ధవర్తనము, జీవహింస, చోరత్వము, కూటసాక్ష్యము
నొసంగుట, వాగ్దానమును జెల్లింపక పోవుట, యనృతమ్మాడుట,
కులాచారములను విడనాడుట, విధవలను బెండ్లియాడుట,
జారస్త్రీలతో భోగించుట, రజస్వలను గలియుట, సత్కార్య
ములకు విఘ్నము గలిగించుట, పతివ్రతయు, సత్ప్రవర్తనయు,
సకలసుగుణాభరితయు, నగు కాంతను బరిత్యజించుట, గురు
దూషణమొనర్చుట, తల్లి దండ్రులను బోషింపకుండుట
నమ్మించి మోసపుచ్చుట, మేలుచేసినవారికిఁ గీడుసేయుట,
చేసిన మేలును మఱచిపోవుట, బిడ్డల నమ్ముకొనుట, దిక్కులేని
వారిననాదరించుట, మొదలగు పాపములన్నియు రెంతవ
తరగతిలోనివి. వీనికి శిక్షలు గలవు. ఇట్టిపాపులందఱుఁ
బశుపక్ష్యాదుల యోనులయందుఁ గాని, యెనుబదినాలుగు
లక్షల జీవరాసుల యోనులయందుఁ గాని, పుట్టుచుందురు.
తిరిగిచచ్చుచుందురు. ఈజన్మలయందుఁ బుణ్యము నార్జించి
నచోఁ దుదకు మనుష్యయోనియందు ఛండాలవంశమునఁ
బుట్టెదరు. ఇచ్చును బుణ్యము నార్జించినవోఁ గ్రమక్రమముగా
హెచ్చుజన్మములను దరించి తుదకగ్రజన్మమును బొందెదరు.

ఈజన్మమున సాత్త్వికగుణప్రధానులై, సన్మార్గమున వర్తించు నెడల జన్మరాహిత్యమును బొంది శాశ్వత పుణ్యలోక నివాస సౌఖ్యమును బొందెదరు. ఈవిధముగా మానవజన్మ మంత మొందుచున్నది.

మనము సంసారమును దరింపవలయునన్నఁ గొన్ని సాధనములు గలవు. అందు భగవద్భక్తియనునది మిగులఁ బ్రశస్తమైనది. భగవద్భక్తి వలన సకల పాపములును నశిం చును. తుదకు మహాపాతకులుగూడ దీనివలనఁ దరింపఁగలరు. ఈభగవద్భక్తికనుసరణములై, యహింసయు, సర్వభూత సమ త్వము—ఆత్మస్వరూప విజ్ఞాన పరిపూర్ణత్వము, మొదలగు నవి యన్నియు నుండవలయును. అప్పుడిది మిగులరాణింపఁ గలదు.

బాలకులారా! ఈపాఠమువలన, నారోగ్యమును గాపాడు కొనుటయుఁ, బాపములకు లోనుగాకుండుటయు, భగవద్భక్తిని గలిగియుండుటయు, గృహస్థధర్మముల నడుపు టయు, మున్నగువానినిఁ జక్కఁగా గ్రహింపుఁడు.

సంపూర్ణము.